Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)



స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 25 • 18-6-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



● పొన్నాల భుజం మీద తుపాకి పెట్టి

# కెవిపిని గురి చూసి కాల్చేయత్నం!

పోలవరం డిజైన్ మార్చాలని జలయజ్ఞంలో వేల కోట్ల అవినీతికి బాధ్యత వహించి నీళ్లమంత్రి పొన్నాల లక్ష్మయ్య రాజీనామా చేయాలని కాంగ్రెస్ సీనియర్లు చేస్తున్న గోలకు కారణం ఏమిటన్న చర్చ ఆసక్తిగా మారింది. ఈ గోల చేసేది ఒకరు చేయించేది ఒకరు అన్న అనుమానమే ఆ ఆసక్తిని కల్గిస్తున్నది.

పోలవరం ప్రాజెక్ట్ వివాదం ఈనాటిది కాదు. ఐదేళ్ల క్రితం దాని నిర్మాణం తలపెట్టినప్పుడు కమ్యూనిస్టు పార్టీలు వ్యతిరేకించాయి. ప్రస్తుత డిజైన్ వల్ల ఖమ్మం, పశ్చిమగోదావరి జిల్లాలోని వందలాది ఏజన్సీ గ్రామాలు ముంపుకు గురి అవుతాయి కాబట్టి, దాన్ని డ్యామ్‌గా కాక బ్యారేజిగా మార్చి కట్టాలని సిపిఎం నేత బివి.రాఘవులు పెద్ద ఉద్యమమే చేశాడు. అయితే వైఎస్ అందుకు సమ్మతించ లేదు. ఆ వివాదం ముదిరి, కాంగ్రెస్ కమ్యూనిస్టుల మధ్య తెగతెంపులకు దారి తీసింది. అయినా వైఎస్ లెక్క చేయలేదు. పోలవరం మీద అంత పట్టుదల వుండేది ఆయనకు. టిఆర్ఎస్ అధ్యక్షుడు కెసిఆర్ కూడా అప్పుడప్పుడు పోలవరం నిర్మాణాన్ని వ్యతిరేకిస్తూ ప్రకటనలు చేసేవాడు. దాని వల్ల తెలంగాణ ప్రాంతానికి తీరని నష్టం జరుగుతుందని ఆరోపించేవారు. అయితే ఈ వివాదాలు నడిచిన ఏ దశలోనూ కాంగ్రెస్ సీనియర్లు అందులో వేలు పెట్టలేదు. ఏ ఒక్క రోజు కూడా తమ అసమ్మతి తెలపలేదు.

పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణానికి మొదట పిలిచిన టెండర్లలో పనులు దక్కించుకొన్న కాంట్రాక్టర్లు పని చేయలేకపోయారు. వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వారిని పిలిపించి, కాంట్రాక్టులు రద్దు చేసుకోవడానికి ఒప్పించి, అందుకు నష్టపరిహారంగా దాదాపు 500 కోట్ల రూపాయల వరకు చెల్లిస్తామని ప్రభుత్వం నుంచి హామీ ఇప్పించి, ఆ టెండర్లను రద్దు చేశారు. ఆ వెంటనే ప్రాజెక్ట్ నిర్మాణ వ్యయం మూడువేల కోట్ల రూపాయల మేర పెంచిపారేశారు. కొత్త టెండర్లు పిలిచే ప్రక్రియ ఆయన హెలికాప్టర్ తప్పిపోయిన రోజు మొదలైంది. హెలికాప్టర్ ఆచూకీ లభించక, రాష్ట్రమంతా ఆందోళన చెందుతున్న సమయంలో, ఢిల్లీ నుంచి అధిష్టానం దూతలుగా వచ్చిన పృధ్వీరాజ్ చౌహాన్, వీరప్ప మొయిలీల సమక్షంలో ప్రభుత్వ సలహాదారుడు కెవిపి.రామచంద్రరావు పోలవరం టెండర్లను ఇంటర్నెట్‌లో అప్‌లోడ్ చేయమని ఇరిగేషన్ ఇంజనీర్లకు ఆదేశాలిచ్చారు. అప్పట్లో అది పెద్ద వివాదంగా మారింది. వైఎస్ బ్రతికి వున్నాడా, చనిపోయాడా అన్న ఆందోళనతో ప్రజలు తిండి తిప్పలు మాని టీవీ ఛానళ్లకు అతుక్కొనిపోయిన సమయంలో కెవిపి.రామచంద్రరావు టెండర్ల గురించి మాట్లాడడం పృధ్వీరాజ్ చౌహాన్‌కు రుచించ లేదు. ఆ విషయాన్ని ఆయన ప్రధానమంత్రికి ఫిర్యాదు చేశాడు. సోనియాగాంధీ దృష్టికి కూడా వెళ్లింది. ఆ టెండర్లను రద్దు చేయమని ఆదేశించారామె.




కొరవ 14వ పేజీలో

కార్టూన్ స్కోప్




నిన్నే మా అబ్బాయిని 'ప్రైవేటు స్కూల్లో' చేర్పించాం! ఇంకేం దొరుకుతుంది బాబూ మా ఇంట్లో...?

# దూతల దురవస్థ!

వైఎస్ జగన్‌ను ఎట్లయినా అధిష్టానానికి దగ్గర చేయాలని కొందరు ఆంధ్ర ఎమ్పీలు కంకణం కట్టుకొని పని చేస్తున్నారు. నెల్లూరు లోక్‌సభ సభ్యుడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి, అనంతపురం లోక్‌సభ సభ్యుడు అనంత వెంకటరామరెడ్డి ఈ దూతల బృందంలో ముఖ్యులు. జగన్ పట్ల అధిష్టానంలో వ్యక్తమౌతున్న ఆపుకోలేని ఆగ్రహాన్ని చల్లార్చడానికి కెవిపి రామచంద్రరావు, ఉండవల్లి అరుణకుమార్‌లు చేస్తున్న ప్రయత్నానికి ఈ దూతల ప్రయత్నం కొసరు వంటిది. ఆ ప్రయత్నంలో వీరు చాలా అవస్థలు పడవలసి వస్తున్నది. జగన్ జనాకర్షణ కల్గిన నేత కాబట్టి, ఆయన్ను దూరం చేసుకొంటే పార్టీకి నష్టమని చెప్పాలని వీరు ప్రయత్నించారు. అయితే ఆ మాట ఢిల్లీ పెద్దలెవరికీ రుచించడం లేదు. జగన్‌ను వైఎస్ కుమారుడిగా తప్ప, స్వంత వ్యక్తిత్వం వున్న నాయకుడిగా గుర్తించడం లేదు అధిష్టానం. పైపెచ్చు, ఓట్లను రాబట్టే జనాకర్షణ సోనియా గాంధీ, రాహుల్‌గాంధీలకు మాత్రమే వున్నాయన్నది ఢిల్లీ వర్గాల భావన. మరొకప్రక్క వైఎస్ కుటుంబ అక్రమార్జన ఢిల్లీలో కథలు కథలుగా ప్రచారంలో వుంది. దానితో రాహుల్ గాంధీ జగన్ పట్ల అయిష్టంగా వున్నాడని వినికిడి. ఈ నేపథ్యంలో సోనియాగాంధీ వద్దకు వెళ్లి, జగన్‌కు సానుకూలంగా మాట్లాడడానికి ఈ దూతలు సాహసించలేక పోతున్నారు. జగన్ జనాకర్షణ గురించి చెప్తే, ఆమె ఏ రకంగా తీసుకొంటుందో అని హడలి పోతున్నారు.

> **జగన్‌ను అధిష్టానానికి దగ్గర చేయను నానాపాట్లు పడుతున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి.**

కెవిపి.రామచంద్రరావు, ఉండవల్లి అరుణ్ కుమార్‌లకు అహ్మద్ పటేల్, వీరప్ప మొయిలీ, ప్రణబ్ ముఖర్జీ వంటి అధిష్టాన పూజారులతో సాన్నిహిత్యం వుంది. దేముడు వరమివ్వాలంటే ముందుగా పూజారిని ప్రసన్నం చేసుకోవాలి కదా? అయితే అక్కడా వారికి ఇబ్బందులు తప్పడం లేదు. జగన్ పట్ల సానుకూలతతో వ్యవహరించమని కోరితే, ఢిల్లీ పెద్దలు తమ వైపు నుంచి హామీలు కోరుతున్నారు. తాము చెప్పేవరకు జగన్ మౌనంగా వుండాలని, యాత్రలు గీత్రలు మానాలని ఆదేశిస్తున్నారు. అయితే అటువంటి ఆంక్షలకు కట్టుబడే తీరులో జగన్ లేదు. అధిష్టానాన్ని గౌరవించి తాను

కొరవ 14వ పేజీలో

# ఎవడబ్బ సొత్తు?

జలయజ్ఞం మరొకసారి రచ్చకెక్కింది. రచ్చ మీద దాని చర్చ లేని క్షణం వుంటే గదా, ఇప్పుడు కొత్తగా ఆ సంగతి చెప్పుకోవడానికనే ప్రశ్న కలగడం సహజం. మొదలు పెట్టిన క్షణం నుంచి దాని బ్రతుకంతా బజారులో భ్రష్టుత్వమే. పత్రికలు, ప్రతిపక్షాలు, ప్రజాసంఘాలు, న్యాయస్థానాలు.... ఇట్లా ఒకటేమిటి దేశంలో ఎన్ని వేదికలున్నాయో అన్నిటిలో భ్రష్టుపట్టిన పథకమిది. ఈసారి విశేషం – స్వంత పార్టీ నేతలు విమర్శనాస్త్రాలు సంధించడం. తెలంగాణకు చెందిన కాంగ్రెస్ సీనియర్ నేతలు ఈ పుణ్యం కట్టుకొంటున్నారు. తెలంగాణ మొత్తం మీద జలయజ్ఞం ప్రాజెక్ట్‌ల వల్ల ఒక్క ఎకరాకు అదనంగా నీరు ఇచ్చినట్లు నిరూపిస్తే, తన పదవికి రాజీనామా చేసి, నేలకు ముక్కు వ్రాస్తానని సవాలు విసిరాడు ఒక కాంగ్రెస్ శాసనమండలి సభ్యుడు. జలయజ్ఞంలో పొన్నాల లక్ష్మయ్య వెయ్యి కోట్ల వరకు దోచుకొన్నాడని మరొక కాంగ్రెస్ సీనియర్ నేత నిందించాడు. పోలవరం ప్రాజెక్ట్ డిజైన్ మార్చుకుంటే తెలంగాణ తీవ్రంగా నష్టపోతుందని వీరందరూ కలిసి గవర్నర్‌కు వినతిపత్రం ఇచ్చారు.

జలయజ్ఞం ఉదాత్తమైన పథకం. దాన్ని చిత్తశుద్ధితో అమలు చేసి వుంటే మన గడ్డ మీద కరవు అన్న పదానికి స్థానం మిగిలేదే కాదు. ఆంధ్రప్రదేశ్ నిజంగానే స్వర్ణాంధ్ర ప్రదేశ్‌గా రూపాంతరం చెందేది. కానీ దురదృష్టవశాత్తు ఎంతో సదాశయంతో ప్రారంభించిన జలయజ్ఞానికి రాజకీయవాదుల అవినీతి దాహం ఆదిలోనే హంసపాదుగా పరిణమించింది. ప్రభుత్వ ఖజానాలోని ప్రజల ధనాన్ని తమ జేబులలోకి మళ్లించుకోవడానికి దీన్నొక సులువైన మార్గంగా వాడుకొన్నారు రాజకీయవాదులు. మంత్రులు, ముఖ్యమంత్రులు, ఐఎఎస్ అధికారులు, ఇంజనీర్లు, కాంట్రాక్టర్లు ఒక ముఠాగా ఏర్పడి, జలయజ్ఞం పేరిట రాష్ట్రాన్ని కొల్లగొడుతున్నారు. దాని ఫలితంగా 50వేల ఎకరాలకు కూడా నీరు పారకుండానే 50వేల కోట్ల రూపాయలు కర్పూర హారతై పోయాయి. మరొక లక్షా యాభైవేల కోట్ల రూపాయలిస్తే తప్ప జలయజ్ఞం ఒక రూపం సంతరించుకోలేదని ఇంజనీర్లు తేల్చి చెప్తున్నారు. అది కూడా ఏటా 15వేల కోట్ల రూపాయలకు తగ్గకుండా క్రమంలో ఇస్తేనే అని షరతు పెడుతున్నారు. అంత సొమ్ము ప్రభుత్వం వద్ద లేదు. కొత్తగా పెడితే తప్ప ప్రాజెక్ట్‌ల నీళ్లు పొలాలకు చేరవు కాబట్టి, ఇప్పటివరకు పెట్టినదంతా దండగే అని అర్థం.

జలయజ్ఞంలో అవినీతికి పరాకాష్ఠ – ప్రాణహిత చేవెళ్ల ప్రాజెక్ట్. ఒక్క రాయి ఇటు తీసి అటు పెట్టకుండానే, ఒక్క తట్ట మట్టి ఎత్తి పోయకుండానే 1500 కోట్ల రూపాయల ఖర్చు వ్రాశారు. ఇందులో సగభాగం కాంట్రాక్టర్లకు మొబిలైజేషన్ అడ్వాన్స్ రూపంలో ఇచ్చిందే కావడం గమనార్హం. కాలువ ఎక్కడ మొదలు పెట్టి, ఎక్కడ ముగించాలో సర్వే కూడా చేయకుండా టెండర్లు పిలిచి, అడ్వాన్స్ మొత్తాలు చెల్లించడంలోని అర్థం ప్రజాధనాన్ని దోచుకొని తినడం తప్ప వేరొకటి ఏమి వుంది. ఈ నిధుల స్వాహా తీరు చూసి ముఖ్యమంత్రి రోశయ్యకు దిమ్మతిరిగిపోయిందట. ఇంత అన్యాయమా అని నిట్టూర్పు విడిచాడాయన. పోలవరంలో కూడా ప్రాజెక్ట్ డిజైన్‌కు అనుమతి లేకుండానే కాలువలు త్రవ్వి వేల కోట్లు జేబులో వేసుకొన్నారు కాంట్రాక్టర్లు.

ఎవడబ్బ సొమ్మని ఇట్లా కొల్లగొడుతున్నారు? ఈ అవినీతి దాహానికి ఒక అంతమంటూ లేదా? ఈ దోపిడీ ఇట్లానే యదేచ్ఛగా కొనసాగి పోవలసిందేనా? ప్రతి పక్షాలు, పత్రికలు ఈ తప్పులను ఎత్తి చూపితే, ఓర్వలేని విమర్శలని తీసిపారేశారు. స్వంత పార్టీ నేతలే గగ్గోలు పెడుతున్న ఈ సమయంలోనైనా జలయజ్ఞం మీద సమీక్ష జరపవలసిన అవసరం వుందన్న స్పృహ పాలకులలో కలిగితే, ఇక ముందైనా ఈ దోపిడీని నివారించే వీలుంటుంది. కాంట్రాక్టర్ల ప్రయోజనం కోసం వున్న సొత్తు దుబారా చేయడం కంటే, ఏ ప్రాజెక్ట్‌ను పూర్తిచేస్తే నిజంగా పొలాలకు నీళ్లు పారుతాయో అధ్యయనం చేసి, ప్రాధాన్యతా క్రమంలో ఆయా ప్రాజెక్ట్‌లను మాత్రం చేపట్టడం ప్రభుత్వం తక్షణం చేయవలసిన పని. అన్ని ప్రాజెక్ట్‌లనూ ఒకేసారి నిర్మించడం ఆర్థిక వసతుల రీత్యానే కాదు, సాంకేతిక సమర్థత రీత్యా కూడా సాధ్యమయ్యే పనికాదు. ముఖ్యమంత్రి రోశయ్య ఇప్పుడైనా కళ్లు తెరిచి, ఈ నిలువు దోపిడీని నిలువరించడం అవసరం.

జమీన్‌రైతు

## జనవాణి

### జీవితాలతో ఆడుకొంటున్నారు!

విద్యార్థి భవిష్యత్తును మలుపు తిప్పే కీలక పరీక్షలు ఇంటర్‌వి. కెరీర్ ఎంపిక నుంచి ఉన్నత విద్యకు బాటలు వేసే అతిముఖ్యమైనవి. ఇటువంటి పరీక్షల పేపర్ల దిద్దడంలో అధ్యాపకులు చేసిన అవకతవకలకు విద్యార్థులు మూల్యం చెల్లించుకోవాల్సి రావడం బాధాకరం. ఇంటర్‌లో వచ్చే ప్రతిమార్కు విద్యార్థి కెరీర్‌ను శాసిస్తుంది. ఈసారి ప్రశ్నాపత్రాల రీవాల్యుయేషన్‌లో ఏకంగా నాలుగువేల మంది విద్యార్థుల మార్కులు మారిపోవడంతో వీరెంత శ్రద్ధగా పేపర్లు దిద్దుతున్నారో లోకానికి వెల్లడయ్యింది. ఇంటర్‌బోర్డు నిర్వాహకులు చేసిన తప్పుకు చెంపలేసుకోక కుంటి సాకులు చెప్పడం దారుణం. ఇకనైనా ఇంటర్ బోర్డు తన పనితీరు మార్చుకోవాలి.

కె.రమణయ్య, నెల్లూరు.

### మహిళా బిల్లుకు మోక్షమెప్పుడు?

మహిళా రిజర్వేషన్ బిల్లును రాజకీయపార్టీలు మళ్లీ అటక ఎక్కించాయి. బిల్లులోని లోటుపాట్లు సరిదిద్దాలేగానీ నీరుకార్చకూడదు. అధికసీట్లు పోతాయని, రాజకీయ స్వార్థంతో సంకుచిత స్వభావంతో ఈ బిల్లును చట్టం కాకుండా చేస్తున్నారు. వేదికలపై మాత్రం మహిళలపై ప్రేమ వున్నట్లు ఉపన్యాసాలు దంచుతున్నారు. చట్టసభల్లో మాత్రం పురుష పుంగవులైన నాయకులు చేయాల్సింది చేస్తున్నారు. స్త్రీలపై యాసిడ్ దాడులు, అత్యాచారాలు, లైంగిక వేధింపులు పెచ్చుపెరిగిపోయాయి. ఇవి తగ్గాలంటే చట్టసభల్లో మహిళలకు తగిన ప్రాతినిధ్యం వుండాలి. దేవగౌడ ప్రధానిగా వుండగా లోక్‌సభలో ప్రవేశపెట్టిన ఈ బిల్లుకు ఇంకా మోక్షం కలగకపోవడం శోచనీయం.

పి.సుధామయి, నెల్లూరు

### విద్యుత్ బిల్లుల వసూలు కేంద్రాల వద్ద ఇక్కట్లు!

రాష్ట్రంలో విద్యుత్‌ను ఉత్పత్తి చేసే, సరఫరా చేసే సంస్థలు వ్యాపారం చేస్తున్నాయి తప్ప విద్యుత్ వినియోగదారుల సమస్యలను ఏమాత్రం పట్టించుకోవడం లేదు. విద్యుత్ బిల్లుల రీడింగ్‌ను తాత్కాలిక వుద్యోగులు తీసి ఇచ్చేస్తారు. సందేహాలను నివృత్తి చేయరు. సబ్‌స్టేషన్లలో ఏ అధికారి ప్రజలకు అందుబాటులో వుండరు. విద్యుత్ బిల్లుల చెల్లింపు కేంద్రాల వద్ద షెడ్లు లాంటి నిర్మాణాలు కూడా లేవు. విని యోగదారులు బిల్లులు చెల్లించే లోపల ఎండా, వానలకు ఇబ్బంది పడక తప్పడం లేదు. ట్రాన్స్‌కో ప్రజలకు జవాబుదారి సంస్థగా వుండబని లేదా?

సి.హెచ్. సురేష్‌బాబు, నెల్లూరు

## 70 ఏళ్ల క్రితం ఈవారం

21-6-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు మునిసిపాలిటీ

ప్రస్తుత కమీషనరు గారు ఛార్జి తీసుకొని 8 నెలలైనా ఇంతవరకు టౌన్ నాలుగు మూలలు తెలుసుకొన ప్రయత్నించినటులలేదు. హెల్తు డిపార్టుమెంటుకు హెల్తాఫీసరు, ఇంజనీయరు శాఖకు ఇంజనీయరు గారలు వుండేటప్పుడు తాను చేయవలసిన తనిఖీ యేమీ లేదని వీరి వాదన. తనకంటే హెచ్చు జీతాలు తీసుకొనే కమీషనర్లు చిన్న మున్సిపాల్టీల్లో వున్నప్పుడు. తక్కువ జీతం గల తాను పెద్ద మునిసిపాలిటీలో ఎందుకు కష్టపడాలి అనే ఉద్దేశం గూడా వున్నట్లుంది.

వీరు మంచివారే దయార్ద్ర హృదయులే కావచ్చుగాని టౌనుకు ఏమి లాభం? కాబట్టి టౌను అభివృద్ధికై చురుగ్గా పనిచేసే మరో కమీషనరును కౌన్సిలు వారు తెప్పించడం అవసరం.

### బుచ్చి పంచాయతీ బోర్డు

ఏ కారణము చేతనైతేనేం దొడ్లవారు ప్రెసిడెంట్ పనికి పూనుకోకపోవడం ప్రశంసార్హమే. బలరామిరెడ్డి గారు గూడా రాజీనామా యిచ్చి, యిరు పక్షాలు ఏకీభవించి నడుపుకోండి అని ఆశీర్వదించి వదలి పెడితేనే బాగుంటుందని మా సలహా.

ఇరుపక్షాల పెద్ద రెడ్లు అందులో వుండకుంటేనే బాగా సాగుతుంది.

### నెల్లూరు సౌత్ స్టేషను

ప్లాటు ఫారం చాలా తగ్గులో వుంది. అంతేగాక వంకరగా గూడా వుంది. ఆ కారణంతో ట్రైన్‌ను నిలిచిపుడు మరొకరు తలుపును వెనక్కినెట్టి పెడితేగాని ఎక్కడానికి, దిగడానికి సాధ్యం గాదు. స్త్రీల గతి, ముసలివారి గతి అది చెప్ప సాధ్యంగాదు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

17-6-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### విద్యా మంత్రి విందు చేయలేదట!

3-6-60 'జమీన్‌రైతు'లో "సుబ్బారెడ్డి గారు నిష్క్రమణ ఆనంద చిహ్నంగా విందులా?" అను శీర్షిక క్రింద, 2వ తేది 'ఆంధ్ర పత్రిక'లో ప్రకటింపబడిన ఒక వార్తను పునర్ముద్రిస్తూ, సుబ్బారెడ్డిగారి రాజీనామా ఆమోదానికి వీటికీ సంబంధమేమైనా వుందా అని రాజకీయ పరిశీలకులు సందేహిస్తున్నారని, సుబ్బారెడ్డి గారి రాజీనామా అమలుకు వచ్చిన నాటి సాయంకాలం సుబ్బారెడ్డికి బద్ధవిరోధి అనుకొనే పట్టాభి రామారావు విందు జేయడం, తర్వాత రోజు సచివాలయంలో జరగడం ఈ అనుమానానికి ఆస్కారం కల్గిస్తున్నదని వెలిబుచ్చాము. కానీ తాను ఆనాటి(31 తేది) రాత్రి గాని, గత ఐదు మాసాలలో గాని తన యింటిలో విందులు వినోదాలు ఏవీ జరిపింది లేదని పట్టాభి రామారావు గారు తెలియజేస్తున్నారు.

### కావలిలో కాంగ్రెస్ విజయం

కావలి ఉప ఎన్నికలో కాంగ్రెస్ అభ్యర్థి రేబాల దశరథరామరెడ్డి గారు 14,132 ఓట్ల మెజారిటీతో అఖండ విజయం పొందారు.

ఓట్ల వివరం :-

| | | |
|---|---|---|
| నియోజకవర్గంలో మొత్తం ఓటర్లు | – | 72,026 |
| మొత్తం పోలైన ఓట్లు | – | 35,986 |
| రేబాల దశరథరామరెడ్డి (కాంగ్రెస్) | – | 25, 059 |
| తల్లపనేని రామకృష్ణయ్య (స్వతంత్రుడు) | – | 10,927 |
| చెడిపోయిన ఓట్లు | – | 932 |

మొత్తం ఓట్లలో నూటికి 49.9 పాళ్లు పోలయినవి. కాంగ్రెస్‌కు మొత్తం ఓట్లలో నూటికి 34.8, పోలైన వాటిలో నూటికి 69.6, స్వతంత్ర అభ్యర్థికి మొత్తం ఓట్లు నూటికి 26.3, పోలైన వాటిలో నూటికి 30.3 ఓట్లు వచ్చినవి.

# నెల్లూరు ముచ్చట్లు

## మంత్రిగారికి తుంటి సమస్య

జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి తుంటికి సంబంధించిన సమస్యతో బొల్లినేని ఆస్పత్రిలో చికిత్స తీసుకొన్నారు. భరించలేని కాలు నొప్పి రావడంతో ఆస్పత్రికి వెళ్లారు. ఎంఆర్ఐ స్కాన్ తీసి చూస్తే, తుంటి దగ్గర ఒక ఎముక ఇబ్బంది పెడుతున్నట్లు తేలిందట. తాత్కాలికంగా దాన్ని సవరించి పంపారు. నిపుణుల సలహా కోసం వెంటనే హైదరాబాద్ వెళ్లిపోయారు.

మంత్రన్న మర్యాద కూడా లేకుండా అంత నొప్పి పుట్టిస్తుందా ఆ తుంటరి ఎముక? స్పెషల్ జీఓ పాస్ చేసి అయినా దాని భరతం పట్టించాలిప్పుడు.

## దొంగ... ఎన్‌కౌంటర్!

కప్పరాళ్లతిప్పకు చెందిన పేరుమోసిన దొంగ పీరిగ వెంకటేశ్వర్లు(39)ను జిల్లా సరిహద్దు మండలం మర్రిపాడు పరిధిలోని బాట – సింగన్నపల్లె గ్రామాల మధ్య వద్ద 15వ తేది వేకువ జామున పోలీసులు ఎన్‌కౌంటర్ చేశారు. వెంకటేశ్వర్లుతో పాటు మరో ఇద్దరు రోడ్డుపై రాళ్లను పెట్టి లారీలను ఆపి దోపిడీ చేయను ప్రయత్నిస్తుండగా పోలీసులకు రూపాయి కాయిన్ బాక్స్ నుండి ఫోన్ వచ్చిందని, ఆ ప్రాంతానికి పోలీసులు వెళ్లగా రాళ్లతో దాడికి ప్రయత్నించగా ప్రాణ రక్షణ కోసం జరిపిన కాల్పుల్లో వెంకటేశ్వర్లు మరణించాడని సాక్షాత్తు ఎస్పీ దామోదర్ విలేకరులకు చెప్పారు.

వెంకటేశ్వర్లు స్వగ్రామం దగదర్తి మండలంలోని ఉలవపాడు. చిన్న చిన్న దొంగతనాల నుంచి మొదలైన అతని ప్రస్థానం కరుడు కట్టిన స్థాయికి ఎదిగింది. ఇతనిపై రాష్ట్రవ్యాప్తంగా వివిధ జిల్లాల్లో 34 కేసులున్నాయి. హత్యలు, భూ ఆక్రమణలు, దొమ్మీలు, అత్యాచారాలు, దొంగతనాలు చేయడం మంచినీళ్ల మర్యాద. తనపై పోలీసులకు ఫిర్యాదు చేసిన వాళ్లను చావ బాదడం ఇతని నిత్య కార్యక్రమం. వెంకటేశ్వర్లుకు అధికారికంగా ఇద్దరు, అనధికారికంగా ముగ్గురు భార్యలున్నారు. 13వ తేదీ తిప్పలో పేకాడుతుండగా పట్టుకొనిపోయిన ఐడి పార్టీ పోలీసులు ఓ పథకం ప్రకారం ఎన్‌కౌంటర్ చేశారని అతని భార్య ఆరోపించింది.

తిప్ప దొంగలు పోలీసులంటే భయం లేకుండా జిల్లాలో దొంగతనాలకు తెగబడుతున్నందున వారి వెన్నులో వణుకు పుట్టించను ఈ ఎన్‌కౌంటర్‌కు పోలీసులు వ్యూహం రచించినట్లుంది. తిప్పలో వెంకటేశ్వర్లును మించిన దొంగలున్నారు. అయితే వీరికి రాజకీయ నాయకుల అండదండలున్నాయి. వారిని కూడా పట్టి ఎన్‌కౌంటర్ చేస్తే ఎస్పీ దామోదర్‌ను జనం అభినందిస్తారు.



## బెదరగొట్టిన భూకంపం

అండమాన్ నికోబార్ దీవుల్లో 13వ తేది సంభవించిన భూకంపం తాలుకు ప్రకంపనలు నెల్లూరు నగరాన్ని సైతం వణికించాయి. అర్ధరాత్రి దాటాక 1.10 నిమిషాలకు నగరంలోని చాలా ప్రాంతాల్లో రెండు నుంచి మూడు సెకన్లపాటు భూమి కంపించింది. అపార్ట్‌మెంట్లల్లో నివాసముండే వారు బయటకు పరుగెట్టినా, అప్పటికే నిద్రలోనికి జారుకొన్న వారికి భూకంప ప్రకంపనలు తెలియరాలేదు.

## వర్షంతో హాయి – ఎండతో చిరాకు!

నెల్లూరీయులు గత వారం రోజులుగా చిత్రమైన వాతావరణ పరిస్థితుల మధ్య చికాకు చెందుతున్నారు. నైరుతి రుతుపవనాల ప్రభావం వల్ల 11, 12, 13 తేదీల్లో ఓ మోస్తరు వర్షం పడింది. చిత్రంగా 14,15,16 తేదీల్లో మళ్లీ ఎండ అదరగొట్టింది. దీంతో వర్షం కురిసినప్పుడు హాయిని, ఎండతో చిరాకును సింహపురీయులు అనుభవించక తప్పడం లేదు.

## తీరంలో అలజడి

అండమాన్ నికోబార్ దీవుల్లో భూకంపం మూలంగా జిల్లాలోని తడ మొదలు తెట్టు వరకు సముద్రతీర ప్రాంతంలో 13, 14 తేదీల్లో సముద్రుడు కాస్త అల్లకల్లోలమయ్యాడు. ఐదు నుంచి పదిహేను మీటర్ల మేర చెలియలి కట్ట దాటి ముందుకొచ్చాడు. దీని మూలంగా తీరప్రాంత గ్రామాల్లో కాస్త అలజడి రేగింది.

## బొల్లినేని కృష్ణయ్య విజయం!

బెంగుళూరులో 13వ తేది జరిగిన అఖిల భారత కమ్మ సమితి సర్వ సభ్య సమావేశంలో సమితి అఖిల భారత అధ్యక్షునిగా నెల్లూరీయుడు, దేశంలో పెద్ద కాంట్రాక్టర్‌గా పేరు ప్రఖ్యాతులు గాంచిన బొల్లినేని కృష్ణయ్య ఎన్నికయ్యారు. ఈ పదవికి ఆయన ఎన్నిక కావడం ఇది రెండోసారి. కృష్ణయ్యకు మా అభినందనలు.

## ఐసెట్‌లో చంద్రారెడ్డి ప్రతిభ

ఐసెట్ 2010లో నెల్లూరు చంద్రారెడ్డి డిగ్రీ కళాశాల విద్యార్థి వాసు 294వ ర్యాంకు సాధించాడు. ఈ సందర్భంగా జరిగిన కార్యక్రమంలో కళాశాల కరస్పాండెంట్ కోటంరెడ్డి ప్రతాప్‌రెడ్డి మాట్లాడుతూ రాష్ట్ర స్థాయిలో 294వ ర్యాంకు సాధించడం ద్వారా వాసు కళాశాల కీర్తిని ఇనుమడింప చేశాడని, వ్యాపార దృక్పథంతో కాకుండా సేవాభావంతో విద్యాబోధన అందించడం వల్ల తమ కళాశాల విద్యార్థులు అన్ని రంగాల్లో రాణిస్తున్నారని చెప్పారు.



## అప్లై గురు కన్సల్టెన్సీ!

విదేశీ విద్యను ప్రతి ఒక్కరికీ అందుబాటులోకి తేవాలన్న ఉద్దేశ్యంతో అప్లై గురు కన్సల్టెన్సీని స్థాపించినట్లు బ్రాంచి హెడ్ హరికృష్ణ తెలిపారు. యుకెలో విద్యావకాశాలు కల్పించడంతోపాటు స్కాలర్‌షిప్‌లు, ఉచిత ఎయిర్ టిక్కెట్‌లు తామే ఏర్పాటు చేస్తున్నట్లు వివరించారు. విదేశీ విద్యపై అవగాహన కల్పించేందుకు నగరంలోని టూరిజం హోటల్‌లో యూనివర్శిటీ ఆఫ్ ఈస్ట్ లండన్ వారిచే సదస్సు, అడ్మిషన్లను నిర్వహించగా చక్కని స్పందన లభించిందన్నారు. ఈ అవకాశాన్ని ప్రతి ఒక్కరూ వినియోగించుకొని విదేశాలలో ఉన్నత విద్యను అభ్యసించాలని కోరారు.

## తపాలా శాఖ ద్వారా గుర్తింపు కార్డులు!

తపాలా శాఖ ద్వారా చిరునామా గుర్తింపు కార్డులను జారీ చేస్తున్నారు. కార్డులు అవసరమైన వారు సమీప తపాలా కార్యాలయంలో పది రూపాయలు చెల్లించి దరఖాస్తు పొందవచ్చు. విచారణ అనంతరం కార్డును ఇచ్చే సమయంలో 240 రూపాయలు ఫీజుగా చెల్లించాలి. ప్రతి యేడాది 140 రూపాయలు చెల్లించి ఈ కార్డును రెన్యువల్ చేసుకోవాలి. ఈ గుర్తింపు కార్డును నివాస ధృవీకరణ పత్రంగా కేంద్ర మరియు రాష్ట్ర ప్రభుత్వాలకు చెందిన అన్ని కార్యాలయాల్లో ఉపయోగించుకోవచ్చు.

## గౌస్ మొహిద్దీన్ కాలధర్మం



మాజీ రాజ్యసభ సభ్యుడు మహ్మద్ గౌస్ మొహిద్దీన్ 1తేది హైదరాబాద్‌లో కాలధర్మం చెందారు. గౌస్‌మొహిద్దీన్ చాలా అదృష్ట వంతుడు. నాయుడుపేటలో చిరు వ్యాపారం చేసుకొంటుండిన ఆయన్ను, ఢిల్లీకి పిలిపించి రాజ్యసభ సభ్యత్వం కానుకగా ఇచ్చాడు నేదురుమల్లి జనార్ధనరెడ్డి. రాష్ట్ర రాజకీయవాదులందరినీ ఆశ్చర్యంలో ముంచిన నిర్ణయం. కొమ్ములు తిరిగిన మగధీరులకు కూడా అందని మానిపండు వలె మురిపించే రాజ్యసభ సభ్యత్వం అంత అనాయాసంగా దక్కడం పూర్వ జన్మ సుకృతం. జనార్ధనరెడ్డి తన మీద వుంచిన విశ్వాసాన్ని పరిపూర్ణంగా నిలబెట్టుకొన్నాడు గౌస్ మొహిద్దీన్. చివరివరకు ఆయనకు విశ్వాసపాత్రుడిగా మెలిగాడు. అంత పెద్ద పదవి నిర్వహించినా అతి సామాన్యంగా, అత్యంత నిరాడంబరంగా మెలిగేవాడు. ఆయన కుమారులందరూ అదే సంస్కారాన్ని అలవర్చుకొన్నారు.

## మరణాలు

నెల్లూరు టౌన్‌లో కొన్ని దశాబ్దాలపాటు

కొరవ 14వ పేజీలో

## ముందు పార్కింగ్ స్థలం చూపండి! వాహనాలను ఎత్తుకెళ్తే ఎలా?


రోడ్డు ప్రక్కన పార్కింగ్ చేసిన వాహనాలను పట్టుకెళ్తున్న పోలీసులు.

లేడికి లేచిందే పరుగులా నెల్లూరు ట్రాఫిక్ పోలీసులు ప్రవర్తిస్తున్నారు. జనం చేత శావనార్థాలు తింటున్నారు. నగరంలో ట్రాఫిక్ పద్మవ్యూహంలా తయారయ్యింది. దీని పరిష్కారానికి ఎస్పీ దామోదర్ సీరియస్‌గానే ప్రయత్నిస్తున్నారు. అయితే ఆయన ఆలోచనలు ఇంకా ఓ కొలిక్కి రాలేదు. అయితే ఇంతలోనే ట్రాఫిక్ పోలీసులు ట్రంకురోడ్డులో షాపుల ముందు పార్కింగ్ చేసే వాహనాలను ఇక నుంచి పార్కింగ్ చేయకూడదని హెచ్చరిక జారీ చేశారు. ఒకవేళ ఎవరైనా వాహనాలను పార్కింగ్ చేస్తే రికవరీ వ్యానులో తీసుక వెళ్లిపోతామంటున్నారు. వీటిని వదలను అపరాధ రుసుము వాహన యజమానులతోపాటు షాపుల యజమానుల నుంచి వసూలు చేస్తామంటున్నారు.

నెల్లూరు నగరంలో ట్రాఫిక్ మొత్తం అయ్యప్పగుడి నుంచి మొదలై ఆత్మకూరు బస్టాండ్ వరకుండే ట్రంకురోడ్డు మీదే నడుస్తుంది. ఆర్టీసి బస్టాండ్ నుంచి ఆత్మకూరు బస్టాండ్ వరకు ఈ రోడ్డుకు ఇరువైపులా వుండే స్థలం మినహా నగరంలో ప్రత్యేకంగా పార్కింగ్ స్థలాలు లేవు. జనం నడిచేందుకు గతంలో వుండిన ఫుట్‌పాత్‌లను సైతం ఆక్రమించి పారేశారు. ఈ దురాక్రమణదారుల్లో ప్రముఖులు ఎక్కువగా వుండడంతో వీరి జోలికి వెళ్లే సాహసం ఇటు పోలీసులు, రెవిన్యూ, మునిసిపల్ యంత్రాంగానికి లేదు. తామేదో సంస్కరించామని ఫుట్‌పాత్‌లపై చిన్న వ్యాపారులను మరో గత్యంతరం లేక రోడ్ల ప్రక్కన ట్రాఫిక్‌కు ఇబ్బంది లేకుండా వాహనాలను పార్కింగ్ చేసిన వారిపై చీటికి మాటికి ప్రతాపం చూపుతున్నారు. ట్రాఫిక్ పోలీసులు ముందు నగరంలో పార్కింగ్ స్థలాలు ప్రకటించి ఆతర్వాత ట్రాఫిక్‌లో పార్కింగ్ ఆంక్షలు విధిస్తే బాగుంటుందేమో?


నెల్లూరు ఎమ్మార్వో కార్యాలయంలో ఓటర్ల జాబితా కంప్యూటరీకరణ.

## ఓటర్ల జాబితాల పట్ల శ్రద్ధేలేదు!

ఓటర్ల జాబితాలను రూపొందించే విషయంలో రెవిన్యూ యంత్రాంగం శ్రద్ధ చూపక పోవడంతో అవి తప్పుల తడికలుగానే తయారవుతున్నాయి. ఎన్నికల కమీషన్ ఆదేశించిందనో, మరెవరో ఉన్నతాధికారులు ఒత్తిడి చేశారనో హడావుడి జాబితాలు తయారుచేయడానికి రెవిన్యూ అధికారులు అలవాటు పడిపోయారు. కార్పొరేషన్ ఎన్నికలను పురస్కరించుకొని జూలై 17వ తేదీ ఓటర్ల జాబితాను నూరు శాతం ఫోటోలతో సహా ప్రకటించాలని ఎన్నికల కమీషన్ ఆదేశించింది. దీంతో రెవిన్యూ అధికారులు ఓటర్ల జాబితాలో ఫోటోలు లేనివారు 12వ తేదికల్లా అందించాలని పత్రికాముఖంగా కోరారు. దీనికి 82,028 మంది స్పందించి ఫోటోలు అందించారు. అయితే ఈ ఫోటోలు ఓటర్ల జాబితాలో స్థానం సంపాదిస్తాయన్న నమ్మకం లేదు. గత పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా ఓటర్ల జాబితాలు రూపొందించాలని వివరాలు సేకరించి ఫోటోలు తీశారు. కాని అంతిమంగా జాబితాలో డోర్ నెంబర్లు, ఓటర్ల పేర్లు, తండ్రులు, భర్తల పేర్లు సరిగ్గా పేర్కొనలేదు. చివరికి పురుషులను స్త్రీలుగా స్త్రీలను పురుషులుగా మార్చేసారు. ఎన్నికలకు వారం ముందు ఈ గుర్తింపు కార్డులివ్వడంతో తిరిగి మార్పులు చేయడం కూడ కష్టమయ్యింది. తాజాగా జిల్లాలోని ఓటర్ల జాబితాలో 3,45,341 మంది ఓటర్ల ఫోటోలు లేవని అధికారులు ప్రకటించారు. 82వేల మంది ఇచ్చినా ఇంకా రెండు లక్షలా 63వేల మందికి పైగా ఫోటోలు ఈ నెల 30వ తేదిలోగా అందివ్వాల్సి వుంది. ఇది ఆచరణ సాధ్యమా? ఓటర్ల జాబితాలో ఫోటోలులేని వాళ్లకు నోటీసులు జారీ చేసామని అధికారులు చెప్పినా 14వ తేది వరకు ఈ నోటీసులు అందుకొన్న ఓటరు లేడు. వున్న సమస్యలు చాలవన్నట్లు తమను ఓటర్లుగా చేర్చమని 74,637 మంది మళ్లీ దరఖాస్తు చేశారు. వీటిలో నెల్లూరు రూరల్ నియోజకవర్గం నుంచే 11,943, సిటీ నియోజకవర్గం నుంచి 10,962 కావలి, వెంకటగిరి మునిసిపాలిటీల నుంచి 15,591 మంది దరఖాస్తులు చేశారు. ఈ దరఖాస్తుల విచారణ, జాబితాలో ఓట్లున్న వారి ఫోటోల సేకరణపై రెవిన్యూ యంత్రాంగం ఈసారైన మనసు పెట్టి పనిచేస్తే బాగుంటుంది. నామ్‌కే వాస్తేగా ఈ పని చేయడం వల్ల పోలింగ్ రోజు జనం ఇబ్బందులు పడాల్సి వస్తుంది. నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాల్‌రెడ్డి నెల్లూరు నగర, రూరల్ నియోజకవర్గ ఓటర్ల లిస్టుల సక్రమ తయారీపై దృష్టి పెట్టాల్సి వుంది.

## ప్రజారాజ్యంలో బలంగా మైనార్టీ గళం!


మైనార్టీలను మేయర్ చేయాలంటున్న ప్రజారాజ్యం మైనార్టీ సెల్.

కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల కన్నా ప్రజారాజ్యం పార్టీలో మైనార్టీల గళం ఈ మధ్య బలంగా వినిపిస్తుండడం రాజకీయంగా చర్చనీయాంశమయ్యింది. కాంగ్రెస్ మైనార్టీ సెల్‌కు హుస్సేనీ ప్రాతినిధ్యం వహిస్తుండగా, తెలుగుదేశం మైనార్టీ సెల్‌కు మున్వర్ నేతృత్వం వహిస్తున్నారు. కాంగ్రెస్ పార్టీలోని గ్రూపుల మూలంగా హుస్సేనీ గళం అంతంతమాత్రంగానే వినిపిస్తుంది. మున్వర్‌కు అయితే పార్టీ పదవి అలంకారప్రాయంగానే మిగిలింది. ఓ మోస్తరు మైనార్టీ నాయకులుగా గుర్తింపు పద్ద షేక్ ఖాజావలి, నన్నేసాహెబ్, జకీర్ హుస్సేన్, డ్యాన్సర్ బాబు, నౌషాద్, ఫయాజ్, ఖాజా మొహిద్దీన్, జకీర్ అహ్మద్, రబ్బానిలు ప్రజారాజ్యం పార్టీలో హుషారుగా పనిచేస్తున్నారు. ఇటీవల వీరంతా సమావేశమై కార్పొరేషన్ ఎన్నికల్లో ముస్లింను మేయర్‌ను చేయాలని డిమాండ్ చేశారు. మైనార్టీల ఓట్లు ఎక్కువగా వుండే డివిజన్లలో రాజకీయ పార్టీలు వీరికే టిక్కెట్లు ఇవ్వాలని కోరారు. గత అసెంబ్లీ ఎన్నికల్లో ముస్లింలను మేయర్ చేసే అంశాన్ని ప్రజారాజ్యం పార్టీ అధినేత చిరంజీవి పరిశీలిస్తానన్నారని, ఇప్పటికి సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి కూడా ఈ విషయమై సానుకూలంగా వున్నట్లు ప్రకటించడంపై నగరంలో పెద్ద చర్చ జరుగుతుంది. కార్పొరేషన్ ఎన్నికలకు కూడా పెద్ద గడువు లేనందున అంతిమంగా ఏం జరుగుతుందనేది త్వరలోనే తేలిపోతుంది.

## క్యాన్సర్ ఆస్పత్రికి దొడ్ల కుటుంబీకుల దాతృత్వం


కలెక్టర్‌కు విరాళమందిస్తున్న పొన్నలూరు సీతారామిరెడ్డి.

నెల్లూరులో దొడ్ల కుటుంబీకుల దాతృత్వంతో పలు సంస్థలు ఏర్పడ్డాయి. ఇప్పటికీ ఆ కుటుంబం సాయం చేయడంలో వెనకడుగు వేయడం లేదు. చెన్నైలోని దొడ్ల వరదారెడ్డి – రుక్మిణమ్మ చారిటబుల్ ట్రస్ట్ తరపున ట్రస్టీ దొడ్ల సుబ్బరామిరెడ్డి ఈవారంలో నెల్లూరు రెడ్‌క్రాస్ క్యాన్సర్ హాస్పిటల్‌లో రేడియో థెరపీ భవన నిర్మాణ నిమిత్తం 50 లక్షల రూపాయల మొత్తాన్ని అందించారు. దీన్ని వారి తరపున పొన్నలూరు సీతారామిరెడ్డి 11వ తేది జిల్లా కలెక్టర్ రాంగోపాల్‌కు అందించారు. గతంలోనూ క్యాన్సర్ ఆసుపత్రిలో రేడియో థెరఫీ భవన నిర్మాణానికి దొడ్ల వరదారెడ్డి – రుక్మిణమ్మ ట్రస్ట్ 50 లక్షల రూపాయలు విరాళమందించింది. మొత్తం మీద కోటి రూపాయలు క్యాన్సర్ ఆసుపత్రి కోసం ఇచ్చిన దొడ్ల సుబ్బరామిరెడ్డి దొడ్ల మనసుకు నెల్లూరీయులంతా అభినందనలు తెలపాల్సి వుంది.

## డిఎస్సీ 2008 అభ్యర్థులకు ఊరట!

### పోస్టుల భర్తీకి గ్రీన్‌సిగ్నల్

డిఎస్సీ 2008 అభ్యర్థులకు ఊరటనిచ్చే నిర్ణయం తీసుకొంది ప్రభుత్వం. సెకండరీ గ్రేడు టీచర్ల (ఎస్‌జిటి) పోస్టులు భర్తీ చేయాలని ముఖ్యమంత్రితో సమావేశమైన మంత్రివర్గం నిర్ణయించడంతో ఎంతోకాలంగా ఈ పోస్టుల భర్తీ ఎప్పుడా అని ఎదురుచూస్తున్న డిఎస్సీ 2008 అభ్యర్థుల నిరీక్షణ ఫలించినట్లయింది. ఆనాడు ముఖ్యమంత్రిగా వుండిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి టీచర్ పోస్టుల భర్తీకి డిఎస్సీ నిర్వహించారు. డిఎడ్ చేసిన అభ్యర్థులకు అందులో 30% రిజర్వేషన్ కల్పిస్తున్నట్లు ప్రకటించారు. ఈ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ పలువురు అభ్యర్థులు కోర్టును ఆశ్రయించారు. దీంతో ఎస్‌జిటి పోస్టులు మినహా మిగతా వన్నీ భర్తీ చేసింది ప్రభుత్వం. ఆనాటి నుంచి ఎస్‌జిటి పోస్టులపై ప్రతిష్టంభన నెలకొంది. రెండు సంవత్సరాల అనంతరం మంత్రివర్గ ఉప సంఘం తీసుకొన్న నిర్ణయంతో వీటికి మోక్షం లభించింది.

డిఎస్సీ 2008 ఎస్‌జిటి పోస్టులను భర్తీకి పూనుకోవడం వల్ల జిల్లాలో 498 పోస్టులకు సంబంధించి టీచర్ ఉద్యోగాలు దక్కనున్నాయి. మండల, జిల్లా పరిషత్‌లకు 298 తెలుగు ఎస్‌జిటి పోస్టులు, కావలి, నెల్లూరు మున్సిపాలిటీలకు సంబంధించి 178 పోస్టులు, ఉర్దూ టీచర్ల పోస్టులు 8, ఐటిడిఏ పాఠశాలల్లో ఐదు పోస్టులు మొత్తం 489 భర్తీ కానున్నాయి. జూన్ నెలాఖరు నుంచి ఈ పోస్టుల భర్తీ ప్రక్రియ చేపట్టనుండడంతో ఎన్నాళ్లుగానో ఎదురు చూస్తున్న డిఎస్సీ 2008 అభ్యర్థులు హర్షం వ్యక్తం చేస్తున్నారు.




నెల్లూరులోని వయోజనవిద్య ఉపసంచాలకుల వారి కార్యాలయం.

# సాక్షర భారతిపై నీలి నీడలు!

**వయోజన విద్యా కార్యక్రమానికి భిన్నంగా గ్రామీణులకు విద్యనందించాలన్న తలంపుతో కేంద్ర ప్రభుత్వం శ్రీకారం చుట్టిన సాక్షర భారతి కార్యక్రమానికి ఆదిలోనే హంసపాదు ఎదురయ్యింది.**

జిల్లాలో అమలు కావాల్సిన సాక్షర భారతి కార్యక్రమంపై నీలినీడలు అలుముకున్నాయి. నిర్ణీత సమయం ప్రకారం ప్రభుత్వం నుంచి నిధులు విడుదల కాకపోవడంతో ఈ కార్యక్రమం అమలుపై అనేక సందేహాలు వ్యక్తమవుతున్నాయి. జిల్లాలో సాక్షర భారతి కార్యక్రమం అమలుపై ఇప్పటికే ప్రచారం నిర్వహించారు. గ్రామస్థాయి నుంచి మండలస్థాయి వరకు ఈ కార్యక్రమంలో భాగస్వాములను చేసేందుకు కోఆర్డినేటర్ల ఎంపిక కోసం దరఖాస్తులను కూడా స్వీకరించడం జరిగింది. అయితే ఈ కార్యక్రమా నికి అవసరమైన నిధులు సకాలంలో విడుదల చేయడంలో ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోంది.

## పంచాయితీరాజ్ పెత్తనం

స్థానిక సంస్థల ఆధ్వర్యంలో ఈ కార్యక్రమం అమలు జరుగుతుందని భావించిన ప్రజాప్రతినిధులు చివరకు నిరాశ చెందాల్సిన పరిస్థితి ఏర్పడింది. గతంలో వయోజనులకు గ్రామీణ ప్రాంతంలో అందించే విద్యకు భిన్నంగా సాక్షర భారతి ద్వారా అందించాలన్న లక్ష్యంతో కేంద్ర ప్రభుత్వం ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టింది. మన రాష్ట్రంలో 18 జిల్లాలను ఎంపిక చేసి సాక్షర భారతి కార్యక్రమం లక్ష్యాలకు సంబంధించిన మార్గదర్శకాలను కూడా ప్రభుత్వం జారీచేయడం జరిగింది. పంచాయితీరాజ్ సంస్థల ఆధ్వర్యంలోనే మొత్తం కార్యక్రమాన్ని చేపట్టేందుకు సైతం ప్రజాప్రతినిధులు ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి విజయం సాధించారు.



**నిధులు విడుదల కాలేదు!**

సాక్షర భారతి కార్యక్రమం అమలు కోసం జిల్లాకు కేటాయించిన నిధులు విడుదల కాలేదు. దీంతో కోఆర్డినేటర్ల ఎంపిక ప్రక్రియ తాత్కాలికంగా నిలిపివేసాం. కేవలం దరఖాస్తులు మాత్రమే స్వీకరిం చాలని మండలస్థాయి అధికారులకు సూచించాం. దీనిలో రాజకీయ పైరవీలకు ఆస్కారం లేకుండా అన్ని చర్యలు తీసుకొంటాం.

***కాకాణి గోవర్ధన్‌రెడ్డి**, జిల్లాపరిషత్ ఛైర్మన్*

2001 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం జిల్లాలో 15,22,866 మంది అక్షరాస్యులు వున్నారు. వీరిలో 6,55,891 మంది స్త్రీలు కాగా, 8,66,975 మంది పురుషులు వున్నారు. మొత్తం అక్షరాస్యులు 64.05 శాతం కాగా, వారిలో పురుషులు 73.67 శాతం, స్త్రీలు 56.38 శాతంగా వున్నారు. జిల్లాలో 15 సంవత్సరాలు పైబడిన వారు 59.27 శాతం కాగా, పురుషులు 69.46 శాతం, స్త్రీలు 49.09 శాతంగా వున్నారు. మొత్తం రాష్ట్రంలో 60.47శాతం అక్షరాస్యత వుంది. ఇందులో పురుషులు 70.32 శాతం, స్త్రీలు 50.39శాతంగా వుంది.

2012 సంవత్సరం సెప్టెంబరు నెలలోపల జిల్లాలో 3,06,633 మంది నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా చేయాలన్నదే దీని ముఖ్య వుద్దేశ్యం. ఇందులో స్త్రీలు 2,62,829 మంది, పురుషులు 43,804 మందిగా వున్నారు. వీరిలో 78,594 మంది షెడ్యూల్డు కులాలవారు కాగా, 45,460 మంది షెడ్యూల్డు తెగలకు చెందినవారు, 27,097 మంది మైనార్టీలకు చెందినవారుగా నిర్దేశించారు. తొలి విడతగా 1.3శాతం మందిని నమోదు చేసుకొని ఏప్రెల్ నెల నుంచి తరగతులు నిర్వహించాల్సి వుండగా, నిధుల కొరత కారణంగా వాయిదా పడుతూ వస్తున్నది.

## కార్యక్రమ లక్ష్యాలు

జిల్లాలో అక్షరాస్యత, సంఖ్యా పరిజ్ఞానం లేని వయోజనులను గుర్తించి వారికి ప్రయోజన అక్షరాస్యత, సంఖ్యా పరిజ్ఞానం అందిస్తారు. నూతన అక్షరాస్యులు వారి చదువు కొనసాగించేందుకు ప్రాథమిక అక్షరాస్యతకు వెలుపల అనియత విద్య, సమాంతర విద్యకు అవకాశం కల్పించాల్సి వుంటుంది. నూతన అక్షరాస్యులు, మిగిలినవారు వారి సంపాదన, జీవన పరిస్థితులు మరింత మెరుగు పరుచుకునేందుకు అవసరమైన వృత్తి నైపుణ్యాలు, అభివృద్ధి పరిచే కార్యక్రమాలు అందిస్తారు. వయోజన నూతన అక్షరాస్యులకు ఇతర లబ్ధిదారులకు నిరంతర విద్యా కార్యక్రమాలు నిర్వహించి సమాజానికి తోడ్పపడే విధంగా కృషి చేస్తారు.

జిల్లాలో 15 సంవత్సరాలు ఆ పైబడిన 3,06,633 వయోజనులకు ప్రయోజన అక్షరాస్యతను అందించి వృత్తి శిక్షణ నైపుణ్యాలు అభివృద్ధి పరిచే కార్యక్రమాలు చేపట్టడం ఈ కార్యక్రమం లక్ష్యంగా నిర్ణయించారు. అలాగే షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు ఇతర బడుగు, బలహీన వర్గాలకు చెందిన గ్రామీణ ప్రాంతాలలోని యువతను ఈ పథకంలో చేర్చడం, ప్రతి గ్రూపుకు నిర్దిష్టమైన లక్ష్యం, వ్యూహం వుండేవిధంగా ప్రణాళికను తయారుచేసి పటిష్టంగా అమలు చేయాలని నిర్ణ యించారు.

## మహిళలకు ప్రాధాన్యత

సాక్షర భారతి కార్యక్రమంలో 85శాతం మంది అక్షరాస్యులు కాని మహిళలను దీని పరిధిలోకి తీసుకోవడంతో పాటు వీరికి అత్యంత ప్రాధాన్యతనిస్తారు. గ్రామీణ ప్రాంతాలలో వున్న ఎస్సీ, ఎస్టీ, బిసి, మైనార్టీ వర్గాలకు చెందిన మహిళలకు ప్రత్యేక ప్రాధాన్యత వుంటుంది. మహిళా అభ్యాసకులు ఈ కార్యక్రమంలో పాల్గొనేలా ప్రోత్సహించేందుకు మహిళా కార్యకర్తలను, వాలంటీర్లను ఎక్కువ సంఖ్యలో నియమిస్తారు. ఒక ఉద్యమంగా చేపట్టాల్సిన ఈ కార్యక్రమం ప్రారంభదశలో లోటుపాట్లను ఎదుర్కొంటోంది.

మండల, గ్రామ కమిటీలు పూర్తయిన తర్వాత కార్యక్రమ నిర్వహణకు తదుపరి కో-ఆర్డినేటర్ల ఎంపిక కూడా కొన్ని మండలాల్లో పూర్తి చేశారు. వాటి తర్వాత సర్వే చేసేందుకు సన్నద్ధమవుతున్న తరుణంలో ప్రభుత్వం నిధుల షాక్ ఇవ్వడంతో మొత్తం కార్యక్రమ ప్రక్రియ అర్ధాంతరంగా నిలిచిపోయింది. హైదరాబాద్‌లోని వయోజన విద్యాశాఖ నుంచి నిధులు విడుదల ఆలస్యం అవుతుందని ఇటీవల జిల్లా కేంద్రానికి ఉత్తర్వులు అందాయి. దీంతో అధికారులు కోఆర్డినేటర్ల ఎంపికను నిలిపివేశారు.

కేంద్ర ప్రభుత్వం సూచించిన విధి విధానాలననుసరించి జిల్లాలో సాక్షర భారతి కార్యక్రమం క్రింద 971 గ్రామ పంచాయితీలలో 1922 మంది గ్రామ కోఆర్డినేటర్లు, 46 మంది మండల కోఆర్డినేటర్లుగా అర్హులైన వారిని గుర్తించాల్సి వుంటుంది. వీరి ఎంపికలో స్థానిక సంస్థలకు ప్రభుత్వం పూర్తి అధికారాలు యిచ్చింది. వయోజన విద్యాశాఖ పంపే నిర్ణీత ప్రొఫార్మాలో నియామక ఉత్తర్వులు అందజేయాల్సి వుంటుంది. ప్రొఫార్మాలో కాకుండా ఇతర పత్రాలపై నియామక ఉత్తర్వులు జారీ చేయరాదని అధికారులకు ముందుగా సూచించింది. కాని ప్రయోజనం శూన్యం. ◆J

# కొడవలూరు పిహెచ్‌సికి మాయరోగం!

## ఇబ్బంది పడుతున్న ప్రజలు

అంగట్లో అన్నీ వున్నా అల్లుడినోట్లో శని అన్న చందంగా వుంది కొడవలూరు ప్రాథమిక వైద్య ఆరోగ్య కేంద్రం పరిస్థితి. కేంద్రంలో అన్ని వసతులు వున్నా సిబ్బంది కొరత సాకుతో రోగులకు సరైన వైద్యం అందించకుండా వైద్య సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్న తీరు పట్ల విమర్శలు వ్యక్తమవుతున్నాయి. వున్న సిబ్బంది విధులకు గైర్హాజరు అవుతుండడంతో వైద్యం కోసం చుట్టు ప్రక్కల గ్రామాల నుంచి వచ్చే పేదలు అవస్థలు పడుతున్నారు. రోగులకు చికిత్స అందించేందుకు బెడ్లున్నా బెంచీలపైనే పడుకోబెట్టి సెలైన్ ఎక్కిస్తున్నారు. ఆరోగ్య కేంద్రం ఏర్పాటైన నాటి నుంచి కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు, గర్భిణులకు కాన్పులు చేసిన దాఖలాలు లేవంటేనే ఆరోగ్య కేంద్రం వైద్య సేవలు అందించడంలో ఎంతగా వెనుకబడి వుందో అర్థమవుతుంది. దీనిపై ప్రజలు ఎమ్మెల్యే ప్రసన్నకుమార్‌రెడ్డి దృష్టికి తీసుకొనిపోగా ఆయన తనిఖీలోనూ వైద్యం అందని విషయం బయటపడడంతో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి వైద్యం చేయాల్సిన అవసరం ఏర్పడిందని వ్యాఖ్యానించారంటే ఆరోగ్య కేంద్రం దుస్థితి తేటతెల్లం అవుతుంది. జిల్లా వైద్యాధికారులు స్పందించి పిహెచ్‌సిని ప్రజలకు అందుబాటులోకి తీసుకొచ్చేలా చర్యలు చేపట్టాలని స్థానికులు కోరుకొంటున్నారు.

# వెంకటగిరిలో కేంద్రీయ విద్యాలయానికి స్థలం

## సాధించిన చింతా!

ఎట్టకేలకు వెంకటగిరి కేంద్రీయ విద్యాలయానికి స్థలం కేటాయించింది ప్రభుత్వం. 2007వ సంవత్సరంలో పట్టణంలో కేంద్రీయ విద్యాలయం ఏర్పడింది. ఎమ్పీ నిధులతో రేకుల షెడ్డు నిర్మించి అందులో విద్యాలయాన్ని ప్రారంభించారు. ప్రస్తుతం 472 మంది విద్యార్థులున్న ఈ పాఠశాలకు ఇంతవరకు సొంత భవనం లేదు. ప్రారంభంలో విద్యాలయానికి నిధులు మంజూరైనా స్థలం ఎంపిక జరుగకపోవడంతో నిర్మాణం ప్రారంభం కాలేదు. దీంతో రేకుల షెడ్డులోనే అరకొర వసతుల నడుమ విద్యార్థులు చదువు కొనసాగిస్తున్నారు. ఒకటవ తరగతి నుంచి 8వ తరగతి వరకు విద్యార్థులున్న ఈ కేంద్రీయ విద్యాలయంలో భవిష్యత్తులో 9,10 తరగతులను ఏర్పాటు చేయనున్నారు. ఎంతో ప్రాధాన్యత గల దీనిలో చదువుకొనేందుకు బయట ప్రాంతాల నుంచి విద్యార్థులు వస్తుంటారు. మూడేళ్ల తర్వాత గత వారంలో రాష్ట్ర మంత్రి మండలి ఆమోదంతో బొప్పాపురం వద్ద స్థలం కేటాయించారు. ఇక త్వరలో సొంత భవనం ఏర్పాటు కానుండడంతో చాన్నాళ్లుగా ఎదురుచూస్తున్న విద్యార్థుల కల నెరవేరనుంది.

● పేదల ఇళ్లకు

# అడ్డుతగులుతున్న చోటాలు!

పేదలకు అందజేసే ఇళ్ల స్థలాల విషయంలోనూ చోటా నేతలు పక్షపాత వైఖరి అవలంభిస్తూ పేద ప్రజలపై దందాలు చేస్తున్న వైనం రూరల్ మండలంలో చోటు చేసుకొంటున్నది. మండల పరిధిలోని పలువురు పేదలు ఇళ్ల స్థలాలకై ఎంతోకాలంగా ఎదురు చూస్తూ వున్నారు. కొందరు అధికారపార్టీ నేతలు తమ వారికి, తమ పార్టీకి అనుకూలంగా వ్యవహరించే వారికి మాత్రం సహకారం అందిస్తూ, తాము చెప్పినట్లు వినని పేదలను ఏడిపించుకతింటున్నారు. రకరకాల అడ్డంకులు సృష్టిస్తూ ఇళ్ల స్థలాలు అందకుండా చేస్తున్నారు.

మండల పరిధిలోని గుడిపల్లిపాడు గ్రామంలో మూడేళ్ల క్రిందట నిరుపేదలకు పక్కా ఇళ్లను నిర్మించేందుకుగాను కాలువ పోరంబోకు భూమిని 76ప్లాట్లుగా

## రూరల్ మండలంలో పరిస్థితిది!

విభజించారు. ఇంతవరకు ఒక్కరికి కూడా స్థలాలు కేటాయించలేదు. గ్రామంలో 350 మంది అర్హులున్నప్పటికీ ఏ ఒక్కరు సైతం ఇంటి స్థలం పొందలేకపోయారు. స్థానికంగా వుండే అధికారపార్టీ నేతలు చెప్పినట్లు రెవెన్యూ యంత్రాంగం వ్యవహరిస్తోందని, పేదలకు అన్యాయం చేస్తున్నారని పలువురు ఆరోపిస్తున్నారు.

కొత్తూరు పంచాయితీ చంద్రబాబు నగర్‌లోనూ ఇంటిస్థలాల విషయంలో చోటా నేతలదే పెత్తనం. అర్హులను, అనర్హులుగా, అనర్హులను అర్హులుగా చూపుతూ ఇష్టానుసారంగా వ్యవహరిస్తున్నా ఒక్క అధికారి పట్టించుకోకపోవడంతో పేదలకు ఇళ్ల స్థలాలు కలగా మారాయి.



● పాసు పుస్తకాల కోసం

# పడిగాపులు

ముత్తుకూరు మండలంలోని రైతాంగం పాసుపుస్తకాల కోసం తహశీల్దార్ కార్యాలయం చుట్టూ చెప్పులరిగేలా తిరుగుతున్నా ప్రయోజనం వుండడం లేదు. ఈ పుస్తకాల కోసం దరఖాస్తులు చేసుకొని నెలలు గడుస్తున్నా వాటిని అందజేయకపోవడంతో పనులన్నీ మానుకొని అధికారుల చుట్టూ తిరగాల్సి వస్తోందని రైతులు వాపోతున్నారు.

## ముత్తుకూరు రైతులకు ఎన్నిపాట్లు?

జిల్లా అధికారులు పాసుపుస్తకాల కోసం దరఖాస్తు చేసుకుంటే వెంటనే అందజేస్తామని చెప్తున్నా ఆచరణలో మాత్రం అమలుకావడం లేదు. బ్యాంకుల నుంచి వ్యవసాయరుణాలు పొందాలంటే పాసు పుస్తకాలు తప్పనిసరి కావడంతో రైతులు పలు అవస్థలు పడుతున్నారు.

● ముత్తుకూరులో

# తాగునీరు కలుషితం!

## పంచాయితీల కుంభకర్ణ నిద్ర

ముత్తుకూరు మండలంలో పలు గ్రామాల్లో నీరు కలుషితం అవుతుండడంతో ప్రజలు వ్యాధుల బారిన పడుతున్నారు. మంచినీటి పథకం క్రింద నీటి సరఫరా ప్రారంభించి ఏళ్లుగడుస్తున్నా క్లోరినేషన్ చేసిన దాఖలాలు లేవు. దమ్మాయిపాళెం, పోలంరాజుగుంట ప్రాంతాల్లో త్రాగునీటి సమస్య ప్రజలను పట్టి పీడిస్తోంది. దమ్మాయిపాళెంలో మంచినీటి కోసం బావి త్రవ్వి అక్కడ నుంచి పోలంరాజుగుంటకు నీటి సరఫరా చేస్తున్నారు. దీనిపై మూత ఏర్పాటు చేయకపోవడంతో చెత్తా చెదారం పడి నీరు కలుషితం అవుతుంది. క్లోరినేషన్ చేయకపోవడంతో పాచిపట్టిన నీటినే త్రాగాల్సి వస్తున్నదని స్థానికులు వాపోతున్నారు.

తోటపల్లిగూడూరు మండలం కోడూరు గ్రామంలోని వాటర్ ట్యాంకుది ఇదే పరిస్థితి. సంవత్సరాల తరబడి ట్యాంకును శుభ్రపరచకపోవడంతో త్రాగునీటి కొళాయిల్లో పాచిపట్టి రంగుమారిన నీరు వస్తుండడంతో ప్రజలు అవస్థలు పడుతున్నారు. కొళాయిల్లో వచ్చే నీరు త్రాగలేని విధంగా అపరిశుభ్రంగా వుండడంతో మంచినీటి కోసం వెంపర్లాడాల్సిన దుస్థితి నెలకొనిందని స్థానికులు వాపోతున్నారు.

# ధ్వంసం చేసిన లైలా!

## కోలుకోని అన్నగారిపాళెం మజరా

కావలి మండలం అన్నగారిపాళెం పంచాయితీలోగల వెంకటేశ్వరపురం గ్రామం ఇంకా లైలా తుఫాను సృష్టించిన నష్టాల నుంచి బయటపడలేదు. 300 కుటుంబాలు గల ఈ గ్రామంలో మత్స్యకారులు చేపలు వేటపై ఆధారపడి జీవిస్తుంటారు. అలాంటి మత్స్యకార్లకు సంబంధించిన తెప్పకొయ్యలు, వలలు లైలా తుఫాను కారణంగా పూర్తిగా దెబ్బతిని పనికి రాకుండా పోయాయి. 50కుపైగా ఇళ్లు కూలిపోయాయి. తినడానికి తిండిలేక, జీవనాధారం లేక, ఇళ్లు కూలిపోయి మత్స్యకారులు పలు అవస్థలు పడుతున్నా ఇప్పటివరకు ఏ అధికారి గాని, ప్రజాప్రతినిధులుగాని గ్రామాన్ని సందర్శించి జరిగిన నష్టాన్ని పరిశీలించడం గాని, బాధితులకు సహాయం అందించిన దాఖలాలు లేవు.



నాలుగు నిమిషాలలో ముగిసిన నెల్లూరు మునిసిపల్ స్టాండింగ్ కమిటీ సమావేశంలో మేయర్ భానుశ్రీని నిలదీస్తున్న సిపిఎం కార్పొరేటర్ కత్తి శ్రీనివాసులు.

# వ్యవసాయాధికారుల పక్షపాతం!

రైతులకు స్ప్రింక్లర్లను మంజూరు చేయడంలో వ్యవసాయాధికారులు పక్షపాతంగా వ్యవహరిస్తున్నారని ముత్తుకూరు మండలంలోని రైతులు ఆరోపణలు గుప్పిస్తున్నారు. నారికేళపల్లి పంచాయితీ పరిధిలో జరిగిన రైతు చైతన్యయాత్రలో గాదెలవాగు రైతులు దీనిపై అధికారులను నిలదీశారు. ప్రభుత్వం పలు పథకాలను

## రైతులకు అందని పరికరాలు

ప్రవేశపెడుతున్నా, రైతులకు పలు రాయితీలు ప్రకటిస్తున్నా చిన్న, సన్నకారు రైతులకు మొండిచేయి చూపుతూ ధనవంతులకు కొమ్ముకాస్తున్నారని ధ్వజమెత్తారు. రైతులకు సాయపడనప్పుడు చైతన్యయాత్రలు పెట్టి ఏమి లాభం అని పలువురు రైతులు నిలదీయడంతో అధికారులు నీళ్లునమిలారు.

● చనిపోయినవారి పేరిట

# నిధులు స్వాహా!

## ఉపాధిహామీలో విచిత్రాలివి

పేద ప్రజలకు ఉపాధి కల్పించేందుకు ప్రారంభించిన ఉపాధిహామీ పథకంలో చిత్రవిచిత్రాలు చోటు చేసుకొంటున్నాయి. పలువురు సిబ్బంది అక్రమాలకు, అవకతవకలకు పాల్పడం తెలిసిందే. రాపూరు మండలం ఏపూరులో చాలా ఏళ్ల క్రిందట మరణించిన వారిని కూలీలుగా  చూపించి, వారి పేరుతో నగదు డ్రా చేసుకొంటున్న వైనం ఆలస్యంగా బయటపడింది. గ్రామానికి చెందిన కొప్పల పెంచలయ్య, నరికే పోలమ్మ, రావూరు బుడ్డయ్యలు చనిపోయి చాలా కాలం అయ్యింది. కొందరు వీరిని బ్రతికున్నట్లుగా చూపించి ఉపాధి కూలీలుగా నమోదు చేసి వీరి పేరుతో సంతకాలు పెడుతూ నగదు తీసుకొంటున్నట్లు రికార్డుల్లో నమోదైంది. దీనిని గుర్తించిన స్థానికులు సామాజిక తనిఖీల్లో భాగంగా వచ్చిన అధికారులకు రుజువులతో సహా అన్ని విషయాలను తెలియపరచడంతో అధికారులు విస్తుపోయారు. 2.38కోట్ల రూపాయల మేర పనులు జరిగినట్లు చెప్తున్న తమ గ్రామంలో పెద్ద ఎత్తున అవకతవకలు జరిగాయని, దీనిపై సమగ్ర విచారణ జరిపించి నిజానిజాలు వెలుగులోకి తేవాలని అధికారులను కోరారు. దీనిపై డిఆర్‌డిఏ ఎపిడి వెంకటకృష్ణయ్య మాట్లాడుతూ సమగ్ర విచారణ జరిపి బాధ్యులపై తగిన చర్యలు తీసుకొంటామని హామీ ఇచ్చారు.

● సింహపురిలో

# మద్య రహిత గ్రామం

మద్యం వ్యాపారానికి పోటీలు పడి టెండర్లు దాఖలు చేసి పలువురు మద్యం షాపులను చేజిక్కించుకున్న సంగతి తెలిసిందే. సారా ఉద్యమానికి శ్రీకారం చుట్టిన గడ్డపై మహిళలు సైతం పోటాపోటీగా షాపులను కైవసం చేసుకొనేందుకు బారులు తీరడం పలువురిని ఆశ్చర్యపరచింది. జిల్లా తాగుబోతుల నిలయంగా మారిందని అందరూ ఆందోళన చెందుతున్నా ఇంకా గాంధీ కలలుగన్న గ్రామం జిల్లాలో మిగిలే వుంది. అది సంగం మండలం వెంకటేశ్వరపురం. ఇక్కడ ఘర్షణలకు, గొడవలకు తావులేదు. మద్యం వాసన ఆ గ్రామ పొలిమేరలకు కూడా సోకదు. చివరకు బీడికొట్టు కూడా

## అందరినీ ఆకర్షిస్తున్న వెంకటేశ్వరపురం

లేదంటే ఆశ్చర్యపడాల్సిందే. తీర ప్రాంతంలో మాదిరిగా దురాయి కట్టుబాటు లాంటివి లేకపోయినా ఎవరికి వారు స్వతంత్రంగా తీసుకున్న నిర్ణయం ఆ గ్రామాన్ని మద్యం రహిత గ్రామంగా మార్చింది. సంగం మండలానికి ఐదుకిలోమీటర్ల దూరంలో గల ఈ కుగ్రామం ఒకప్పుడు ఘర్షణలు, కుటుంబ కలహాలకు వేదికగా వుండేది. దీనికంతటికి కారణం మద్యం మహమ్మారేనని తెలుసుకొన్న గ్రామస్తులు ఎవరికివారు మద్యం సేవించరాదని, మద్యం అమ్మకాలకు చోటివ్వరాదని ఆంక్షలు పెట్టుకున్నారు. ఆనాటి నుంచి నేటివరకు మద్యానికి దూరంగా ప్రశాంత వాతావరణానికి కేంద్రంగా పేరుగడించింది.

# పనితీరు మారకపోతే ఆస్పత్రికి తాళాలు!

● వెంకటగిరిలో డిఎం అండ్ హెచ్ఓ హెచ్చరిక

జిల్లాలోని పలు ప్రభుత్వ ఆస్పత్రుల్లో పనిచేసే సిబ్బంది పనితీరు మార్చుగలిగామని, కానీ వెంకటగిరి ఆస్పత్రుల్లో పనిచేసే సిబ్బంది పనితీరులో మార్పురావడం లేదని జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి వెంకటరమణారెడ్డి తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. పలు ఫిర్యాదులు అందడంతో ఆయన వెంకటగిరిలోని ప్రభుత్వ గోషా ఆస్పత్రిని తనిఖీ చేశారు. ఈ సందర్భంగా వైద్యులు రాకపోవడం, రోగులకు వైద్య సేవలు అందకపోవడాన్ని  చూసిన ఆయన తీవ్రంగా స్పందించారు. ప్రభుత్వ ఆస్పత్రిలో రోగులు తక్కువగా వుండడం పట్ల అసంతృప్తి చెందారు. వైద్య సేవలు సక్రమంగా అందితే రోగుల సంఖ్య పెరుగుతుందన్నారు. డాక్టర్లు కవిత, యశోదబాయి, హిమబిందులు విధులకు గైర్హాజరు కావడంతో ఆగ్రహించిన డిఎంహెచ్ఓ పలుమార్లు హెచ్చరించినా సిబ్బందిలో మార్పు రావడం లేదు. ఇలా అయితే ఆస్పత్రులకు తాళాలు వేస్తానంటూ వ్యాఖ్యానించారు. విధులకు ఎగనామం పెట్టిన డాక్టర్లకు ఆబ్సెంట్‌మార్క్ చేసిన ఆయన పట్టణంలోని పలు ప్రైవేటు ఆస్పత్రులను సందర్శించి గర్భిణీలను, బాలింతలను పరామర్శించారు. లింగనిర్ధారణ చేసి చెప్తున్నారనే ఫిర్యాదు అందడంతో ఒక ప్రైవేటు ఆస్పత్రి యజమాన్యాన్ని తీవ్రంగా హెచ్చరించారు. తరచూ ఆస్పత్రులను తనిఖీ చేస్తామన్నారు.

# రైతులకు రూ.150కోట్ల పంట రుణాలు!

జిల్లా సహకార బ్యాంక్ జిఎం వెల్లడి

సీజన్‌తో సంబంధం లేకుండా రైతులకు రుణాలను అందజేయనున్నట్లు జిల్లా సహకారబ్యాంకు జనరల్ మేనేజర్ మదన్‌మోహన్ తెలియజేశారు. సహకార సంఘాల ద్వారా ఈ ఏడాది 150 కోట్ల రూపాయలను పంట రుణాలను రైతులకు ఇవ్వాలని లక్ష్యంగా పెట్టుకున్నట్లు వివరించారు. సంగం మండలం దువ్వూరులో జరిగిన సహకార సంఘ సమావేశానికి విచ్చేసిన ఆయన పలు విషయాలను వెల్లడించారు. జిల్లాలోని 79 సహకార సంఘాల ద్వారా బంగారు నగల తాకట్టుపై రుణాలను ఇచ్చేందుకు అన్ని ఏర్పాట్లు చేస్తున్నామని ఇప్పటికే 40 సహకార సంఘాలకు అవసరమైన ఐరన్‌సేఫ్‌లు, ఇతర సామాగ్రిని అందజేశామన్నారు.

రైతులకు వరి విత్తనాలను రాయితీపై ఇచ్చేందుకు రాష్ట్ర విత్తనాభివృద్ధి సంస్థతో ఒప్పందం కుదిరిందన్నారు. రానున్న ఖరీఫ్ సీజన్‌లో అన్ని సహకార సంఘాల ద్వారా వరి విత్తనాలతోపాటు మెట్టపంటలకు అవసరమైన విత్తనాల్ని అందజేస్తామన్నారు. 2011 నాటికి అన్ని సహకార సంఘాల్లోనూ ఆన్‌లైన్ విధానాన్ని అమలులోకి తేనున్నట్లు వెల్లడించారు.

## నేదురుమల్లి ఏం చెప్పాడు?



నేదురుమల్లి జనార్దనరెడ్డి సతీసమేతంగా ఢిల్లీ వెళ్లి సోనియమ్మను కలిశాడు. తనకు రాజ్యసభ సీటిచ్చినందుకు కృతజ్ఞతలు తెలిపాడు. ఈ నెలలో జరుగనున్న తన కుమారుడి వివాహానికి రావాల్సిందిగా కోరుతూ పెండ్లి పత్రిక ఇచ్చాడు. ఇంతవరకు బాగానే వుంది. ఆ తర్వాత సోనియమ్మతో రాజకీయాలు కూడా మాట్లాడాడట. రాష్ట్ర రాజకీయాలేమీ బాగాలేవు. వెంటనే మార్పులు చేయాల్సిన అవసరముందని చెప్పాడట. అయితే ఈ మార్పులు ఎలా వుండాలి? ఎవరిని మార్చాలి? అన్న విషయాలేమీ ఆయన బయటపెట్టడం లేదు. దీనిపై రాజధానిలో అనేక ఊహాగానాలు జరుగుతున్నాయి. గాంధీభవన్, సిఎల్పీ కార్యాలయంలో ప్రస్తుతం ఇదే హాట్ టాపిక్‌గా మారింది. రాష్ట్ర రాజకీయాల్లో మార్పు అంటే సిఎంను మార్చమనా! లేక పిసిసి అధ్యక్షుడినా! ఈ రెండూకాక రాష్ట్ర మంత్రుల్ని మార్చమనా? ఏమో? అసలు విషయం తెలీక కాంగీయులు బుర్రబద్దలు కొట్టుకొంటున్నారు. జనార్దనరెడ్డి ఢిల్లీకి బయలుదేరే ముందు రోజునే రోశయ్య స్వయంగా వెళ్లి జనార్దనరెడ్డిని కలిశాడు. కాబట్టి సిఎం మార్పును జనార్దనరెడ్డి కోరి వుండకపోవచ్చుని అభిజ్ఞవర్గాల భోగట్టా!



నెల్లూరు తొలి మేయర్ పులిమి శైలజారెడ్డి, రత్నాకర్‌రెడ్డిల కుమార్తె రిషికారెడ్డి, రాకేష్‌రెడ్డిల పెళ్లి రిసెప్షన్‌కు హాజరై శుభాశీస్సులు తెలియజేస్తున్న ప్రజారాజ్యం పార్టీ సర్వాధినేత చిరంజీవి. ఆయన బావమరిది అల్లు అరవింద్.

## రాజ్‌భవన్‌లో గవర్నర్ గిరి



రాష్ట్రంలో అందరిదృష్టి రాజ్‌భవన్ వైపే వుంది. సమస్యలపై రాష్ట్ర ప్రభుత్వ పాలకుల కంటే గవర్నరే సకాలంలో స్పందిస్తుండటమే దీనికి కారణం. ముఖ్యమంత్రి, మంత్రులు, ఐఎఎస్ అధికారులకు చెప్పుకున్నా పనులు జరగటం లేదు. గవర్నర్‌కు పిటీషన్ వేస్తే మాత్రం తిరుగు టపాలో స్పందన కనిపిస్తోంది. దీంతో సచివాలయానికి గుడ్‌బై చెప్పి రాజ్‌భవన్‌కు వెళ్లేవారిలో ఇప్పుడు రాజకీయ నాయకులు కూడా చేరారు. నీటిమంత్రి పొన్నాల లక్ష్మయ్య జలయజ్ఞంలో కోట్లాది రూపాయలు మింగేశాడంటూ కొన్ని రోజులుగా కాంగీయులు ఆరోపిస్తున్నారు. లక్ష్మయ్యను ముఖ్యమంత్రి వెనకేసుకొస్తుండటంతో గవర్నర్‌కు ఫిర్యాదు చేశారు. పొరుగు రాష్ట్రం కర్నాటకలో మాదిరిగా అవినీతి ఆరోపణలున్న మంత్రిపై తగుచర్యలు తీసుకోవాలని కాంగ్రెస్ సీనియర్లు కొందరు గవర్నర్‌ను కోరడం రాజధానిలో హాట్‌టాపిక్ అయింది. చూద్దాం... గవర్నర్ ఏం చేస్తారో!

## కెవిపిపైనే 'గురి'



జలయజ్ఞంలో కోట్లు సంపాదించాడంటూ ఆ శాఖ మంత్రి పొన్నాల లక్ష్మయ్యపై కాంగ్రెస్ సీనియర్లు ఆరోపణలు చేస్తున్నారు. వాస్తవానికి వారి అసలు లక్ష్యం కెవిపి రామచంద్రరావే అన్నది బహిరంగ రహస్యం. వైఎస్ హయాం నుంచి రోశయ్య దాకా కూడా జలయజ్ఞంలో ఏ పని కావాలన్నా కెవిపి దగ్గరకే వెళ్లాల్సి వస్తోంది. వైఎస్ లేకున్నా కెవిపి హవాకు మాత్రం తిరుగులేకపోవడాన్ని కాంగ్రెస్ సీనియర్లు జీర్ణించుకోలేకపోతున్నారు. జలయజ్ఞంపై మామూళ్లలో రోశయ్య కూడా కెవిపితో చేతులు కలిపారన్నది సీనియర్ల అనుమానం. అందుకే మంత్రి వైపు నుంచి నరుక్కు వస్తే అసలు దోషులు బయటకు వస్తారన్నది సీనియర్ల వ్యూహంగా వుంది. అయితే ఈ వ్యూహానికి మంత్రి లక్ష్మయ్య మాత్రం నెత్తినోరూ బాదుకుంటున్నాడు. జలయజ్ఞంలో తాను నిమిత్తమాత్రుడినేనని, అసలు వారిపై కోపం తనపై చూపడం ఏమిటంటూ కళ్ల నీళ్లు పెడ్తున్నాడు. పాపం! లక్ష్మయ్య



## టిఆర్ఎస్ గొంతులో వెలక్కాయ



తెలంగాణ ప్రాంత ఉపఎన్నికల్లో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు కూడా బరిలోకి దిగనుండటంతో టిఆర్ఎస్ గొంతులో పచ్చివెలక్కాయ పడినట్లయింది. ప్రత్యేక తెలంగాణను కోరుతూ టిఆర్ఎస్ ఎమ్మెల్యేలు రాజీనామాలు చేశారు. ఉపఎన్నికలు గనకవస్తే రాజీనామాలు చేసిన వారినే తిరిగి అభ్యర్థులుగా నిలబెట్టాలని అప్పటి జెఎసిలో నిర్ణయం తీసుకొన్నారు. ఆ తర్వాత జెఎసి నుంచి రాజకీయ పార్టీలు బయటకు వచ్చేశాయి. ప్రస్తుతం ఉపఎన్నికల్లో ఇతర పార్టీలు పోటీ చేయకుండా చూడాలని టిఆర్ఎస్ డిమాండ్ చేస్తోంది. అయితే కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు మాత్రం దీన్ని లెక్కచేయకుండా ఎన్నికల బరిలోకి దూకాలని నిర్ణయించాయి. ఉపఎన్నికల్లో త్రిముఖ పోటీ జరిగితే ఓట్లు చీలి ఫలితాలు తారుమారయ్యే అవకాశం వుంది. దీంతో సెంటిమెంట్‌ను రెచ్చగొట్టి ఇతర పార్టీలకు ముక్కుతాడు వేయాలన్నది టిఆర్ఎస్ వ్యూహంగా కనబడుతోంది. వ్రతం చెడ్డా ఫలితమైనా దక్కుతుందో లేదో! పాపం టిఆర్ఎస్!

## కిక్కు వీరులపై నరసింహన్ కన్నెర్ర



రాష్ట్రంలో మద్యం సిండికేట్‌లో వున్న రాజకీయ నాయకులపై గవర్నర్ నరసింహన్ గుర్రుగా వున్నారు. ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ మద్యం వ్యాపారంతో ప్రమేయం వున్న ప్రజా ప్రతినిధుల జాబితాను ఆయన సిద్ధం చేస్తున్నాడట. ప్రజా జీవితంలో వున్నవారు మద్యం వ్యాపారంలో మునిగి తేలుతుండటం గవర్నర్ గారికి ఏ మాత్రం నచ్చడం లేదు. ఇటీవల మద్యం టెండర్లలో కాంట్రాక్టర్లతో చేతులు కలిపిన రాజకీయులు 80శాతం దాకా వున్నారన్నది గవర్నర్ అంచనా. మద్యం టెండర్లలో కోట్లాది రూపాయల నల్లధనం పాత్రపై కూడా గవర్నర్ కూపీ లాగుతున్నారట. దీంతో మద్యం వ్యాపారంతో సంబంధాలున్న ఎమ్మెల్యేలు, ఎమ్పీలు, స్థానిక సంస్థల ప్రతినిధులకు కంటిమీద కునుకు లేకుండా పోయింది. నరసింహన్ కన్నెర్ర చేస్తే పరిస్థితి ఎలా వుంటుందో? ఏమో! చూద్దాం!

## ముద్ద ముద్ద చేసిన రామనారాయణ

ప్రపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి బిజీగా వుండడంతో నెల్లూరులో రైతు సదస్సులు ఒకింత ఆలస్యంగా ప్రారంభమయ్యాయి. నాయుడుపేటలో మంత్రిగారు రైతు సదస్సును ప్రారంభించను వచ్చేసరికి భారీవర్షం పడి ఆ కార్యక్రమం మొత్తం రసాభస అయ్యింది. దీంతో ఎలాగూ ఈ కార్యక్రమం ప్రారంభానికి రాజధాని నుంచి వచ్చేశాను కదా అనుకొన్న రామనారాయణ జోరు వర్షంలోనూ రైతు సదస్సును ప్రారంభించారు. వెంటనే తెలివిగా స్వర్గీయ వైఎస్.రాజశేఖర్‌రెడ్డి ఈ ప్రాంగణంలో తిరుగాడుతుండడం వల్ల వర్షం పడుతోందని ఆయన మాటలు నమస్తే అక్కయ్యా... నమస్తే చెల్లెమ్మా... నమస్తే రైతన్నలను వల్లించారు. విధిలేక మంత్రితోపాటు రైతు సదస్సులో తడచి ముద్దయిన కలెక్టర్ రాంగోపాల్, డిసిసిబి ఛైర్మన్ వాకాటి నారాయణరెడ్డి మాత్రం జలుబు, దగ్గుతో అల్లాడుతున్నారు.

## బల్లిని ఖంగు తినిపించిన దొంగ



గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ మహా మాటకారి... పైపెచ్చు దైవభక్తి పారాయణుడు. వారం, వర్జ్యం, రాహుకాలం, యమగండం చూసుకొని బయట కాలు పెడతాడాయన. అటువంటి 'బల్లి' ఈ వారం జడ్పీ ఆఫీసులో జరిగిన డిఆర్‌డిఏ ప్రత్యేక సమావేశానికి విచ్చేశారు. ఆయన సెల్‌ఫోన్‌లో ఛార్జి అయిపోగా సిఇఓ గదిలో ఛార్జింగ్‌కు పెట్టి మీటింగ్‌లో ఉపన్యాసానికి మళ్లుకున్నాడు. అది ముగిశాక సిఇఓ గదికి వెళ్లిచూడగా ఫోన్ కానరాలేదు. చుట్టు ప్రక్కల వెతికించినా ఫలితం లేదు. ముఖ్యమైన నెంబర్లు ఫోన్‌లో వున్నాయంటూ దొంగను తనదైన నాటుభాషలో తిడుతూ కారెక్కాడాయన. బహుశా మంచి గడియలు చూసి ఫోన్‌కు ఛార్జింగ్ పెట్టి వుండడేమోనని ఆయన సన్నిహితులు వ్యాఖ్యానించారు.

## పోటాపోటీగా బాలయ్య జన్మదినం!



చెరువు నిండితే కప్పలు పదివేలు చేరునని సుమతి శతకకారుడన్నట్లు ఇటీవలవరకు హిట్లు లేక నానాపాట్లు పడిన నటుడు బాలకృష్ణకు 'సింహా' చిత్రం బాగా ఆడడం, రాజకీయాల గూర్చి ఆయన ఎడాపెడా మాట్లాడుతుండడం ఆయన అభిమానుల్లోనూ 'జోష్' పెరిగింది. ఎప్పుడూలేనట్లుగా సింహపురిలో ఈసారి బాలయ్య జన్మదిన వారోత్సవాలను కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, రవికుమార్ చౌదరి గ్రూపులు ధూంధాంగా జరిపాయి. ఎక్కడకు వెళ్లకపోయినా ఇబ్బందులు తప్పవని రెండు గ్రూపులు జరిపిన కార్యక్రమానికి వెళ్లిన జిల్లా తెలుగు నేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి పాము చావకుండా కర్ర విరగకుండా మాట్లాడి వచ్చాడు. గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్, నెల్లూరు నగర తెలుగునేత కిలారి వెంకటస్వామి నాయుడు అయితే ఏకంగా బాలయ్య పాటలకు ఆర్కెస్ట్రాతో కలసి అదిరేటి స్టెప్పులు వేశారు. ఎన్టీఆర్ వీరాభిమాని రమ్మి మాత్రం హైదరాబాద్‌లో జరిగిన బాలయ్య జన్మదినవేడుకల్లో కేక్ కటింగ్ టేబుల్ వద్దే సెటిలయ్యాడు. ఔరా... ఏమి బాలయ్య వైభోగం!

## కొత్త కామ్రేడ్



ఈ వారంతో రాజ్యసభ సభ్యత్వం ముగిసే సిపిఎం రాజ్యసభ సభ్యుడు పెనుబల్లి మధుది నెల్లూరే అయినా ఆయన పార్టీ తరఫున చేపట్టే కార్యకలాపాలు మాత్రం ఇటీవల వరకు హైదరాబాద్‌లోనే సాగేవి. కాని గత మాసం రోజుల్లో ఆయన రెండుమూడుసార్లు నెల్లూరు నగరంలో పర్యటించారు. ఏసి మార్కెట్ వద్ద అధికార పార్టీ అండతో లేపేసిన రోడ్డు మార్జిన్ వ్యాపారుల తరఫున కలెక్టర్, ఎస్పీలతో గట్టిగా మాట్లాడారు. పనిలో పనిగా ఆనం సోదరులను పరుషపదజాలంతో దునుమాడారు. టౌన్‌హాల్‌లో జరిగిన ప్రజాసంఘాల ఐక్యవేదిక సమావేశంలోనూ పనులాగిపోయిన పెన్నా బ్యారేజి పథకాన్ని, ఇందిరమ్మ ఇళ్ల పథకంలో లోపాలను తూర్పారపట్టారు. నెల్లూరులో సిపిఎంకు మంచి క్యాడర్ వుంది. అయితే నాయకుల్లో జోష్ తగ్గడంతో తగవులు తంటాలతోనైనా పార్టీని మునిసిపల్ ఎన్నికలలో గట్టెక్కించను మధును ఇక్కడకు పంపారని ట్రంకురోడ్డులో గుసగుసలు వినిపిస్తున్నాయి. ఏమైతేనేం నెల్లూరు బడుగుబలహీనుల తరఫున పోట్లాడను కొత్త కామ్రేడ్ వచ్చాడు.

## కరిచే కుక్కలను వదలి...



నెల్లూరులో శునక సంతతి విపరీతంగా పెరిగిపోయింది. ఓ మహిళా న్యాయవాది కుక్కలను పట్టి చంపడం అనాగరికమంటూ హైకోర్టులో రిట్ దాఖలు చేసివుందన్న సాకు చూపి కార్పొరేషన్ అధికారులు కూడా నగరంలో కుక్కలు పట్టడం మానేశారు. జనాన్ని అవి ఎడాపెడా పట్టి పీకేస్తుండడం, మునిసిపల్ ఎన్నికల నేపథ్యంలో ప్రజాప్రతినిధుల నుంచి అధికారులపై ఒత్తిడి రావడంతో గత ఆదివారం నుంచి నగరంలో అనధికారికంగా కుక్కలను పడుతున్నారు. సామాన్యంగా జనాన్ని కరిచే కుక్కలు బహు తెలివిగా మసలుకొంటాయి. ఇళ్లకు కాపలా కాసి వారు వేసే ముద్దతినే కుక్కలు మాత్రం నిజంగా నోరులేనివి. ఇవి అమాయక శునకాలు కాబట్టి యదేచ్ఛగా వీధుల్లో తిరుగుతుంటాయి. కుక్కలను పట్టేవారు చేసిన గందరగోళానికి అమాయక శునకాలే వీరి వుచ్చులో బడ్డాయి. కరిచే కుక్కలు మాత్రం తెలివిగా దాక్కొన్నాయి. కరిచే కుక్కలా మజాకానా?

## అన్నింటినీ అడుక్కోవాలా?

నెల్లూరు పోలీసులు అధికార బలం మాటున అన్నింటిని అదోరకంగా దబాయించి అడుక్కోవడం చర్చనీయాంశమయ్యింది. నగరంలో అడ్డదిడ్డంగా నిలిపి వుండే వాహనాల తొలగింపుకు క్రేన్‌ను పోలీసులు కార్పొరేషన్ నిధులను ఒత్తిడితో మరీ విడుదల చేయించి కొనుగోలు చేయించారు. డ్యూటీలో వుండే ట్రాఫిక్ పోలీసులకు రేబాన్ కళ్లద్దాలు, దుమ్ము ధూళి నుంచి కాపాడే మాస్కులు, రెయిన్ కోటులను నగరంలోని ఇద్దరు వస్త్ర వ్యాపారుల డబ్బులతో కొనిపించారు. ఈ వారంలో ట్రాఫిక్‌ను జామ్‌చేసే వాహనాలను వేసుకెళ్లను ఓ ప్రత్యేక లారీని ఓ వ్యాపారవేత్త డబ్బులతో కొనిపిస్తున్నారు. పోలీసుల వద్ద దొంగసొత్తు రికవరీలో నొక్కేసిన సొమ్ముతో పాటు ఎస్పీ వద్ద ప్రత్యేకనిధి వుంటుంది. వాటిలో పైసా బయటకు తీయక ఈ వసూళ్లు ఏమిటని ఆ శాఖలో కాస్త నిఖార్సుగా పనిచేసే పోలీసులు సణుగుతున్నారు.

# వారఫలాలు

తేది 19-06-2010 నుండి 25-06-2010 వరకు మిథునంలో కేతువు; వృషభ, మిథునాల్లో బుధుడు; కర్కాటంలో శుక్రుడు; సింహంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; కన్య, తుల, వృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.




ప్రయాణాలలో జాగ్రత్త అవసరం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. శుభకార్యాలకై వెచ్చిస్తారు. నూతన వస్త్రాభరణాలు కొంటారు. గృహనిర్మాణకార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయ మందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. రాజకీయులకు మేలైన కాలం. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది. విద్యార్థులకు యోగ కాలం. పిల్లల అభివృద్ధి ఆనందాన్నిస్తుంది. ఇష్టమృష్టాన్న ప్రాప్తి.




ప్రయాణాలు ఎదురుచూసిన ఫలితాలనివ్వక పోవచ్చు. ధన విషయంలో కూడ కటకట ఉండవచ్చు. సోదరులతో అభిప్రాయ భేదావకాశాలు. వాదోపవాదాలు తగవు. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. ఇతరుల వ్యవహారాల్లో జోక్యం వద్దు. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా మేలు. అప్పులు తీరుస్తారు. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది.




సమాజంలో కీర్తిప్రతిష్టలకు భంగం ఉండదు. పాదాలకు సంబంధించిన బాధలుంటాయి. ఆర్థికవిషయాలు చక్కగా ఉన్నాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. వాగ్వాదాలలో సామర్థ్య ప్రదర్శన ఉంటుంది. తండ్రి తండ్రివంటివారికి ఇబ్బందులుండవచ్చు. గృహాలంకరణవిషయాలలో ఆసక్తి చూపుతారు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.




వృథా ఖర్చులు తయారుగా ఉంటాయి. ప్రతి అడుగు ఆచితూచి వేయడం మంచిది. అధిక శ్రమ, అల్ప లాభం. ఆర్థిక విషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. కళత్ర సౌఖ్యలోపం ఉండదు. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా ఉండాలి. పైవారిని విమర్శించకుండాలి. వస్త్రాభరణాలు కొంటారు.




ఫలితాలు మీ శ్రమ, సామర్థ్యంపై ఆధారపడి ఉంటాయి. అధిక ఖర్చులు. దూరప్రయాణావకాశాలు. పట్టుదలపై పనులు సాగుతాయి. దైవకార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. వ్యాపారులకు లాభాలలో కోత ఏర్పడవచ్చు. నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. పాతబాకీలు వసూలవుతాయి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమధికం.




నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. ఉద్యోగ ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. వివాహాది శుభకార్యాలలో పాలు పంచుకొంటారు. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు మేలైన కాలం. క్రయ విక్రయాలు మంచి ఫలితాల నందిస్తాయి. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది.




ప్రయాణాలమూలంగా ధనాదాయం ఎదురుచూడవచ్చు. చిన్న చిన్న సమస్యలు తొలగుతాయి. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉచిత సలహాలు స్వీకరించవద్దు. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. శ్రమ, అలసట చోటు చేసుకొంటుంది. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు.




సంతానమూలంగా సుఖశాంతులు. ఇతరులకు కోరినా సలహాలివ్వవద్దు. ఆర్థిక విషయాలు మందకొడిగా సాగుతాయి. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. వ్యాపారులకు ఎదురుచూసిన సత్ఫలితాలు దక్కవు. చాలా ఓర్పు అవసరం. ఎవరికి ఎలాంటి మాట ఇవ్వవద్దు. ఉద్యోగులు భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు.




పౌర సంబంధాలు చక్కగా వుంటాయి. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. గడచిన వారం కన్నా ఉద్యోగులకు కొంత మేలు. వ్యాపారులకు లాభసాటిగా జరుగకపోవచ్చు. భాగస్వాములతో జాగ్రత్త. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది.




సమాజ కార్యక్రమాలలో చక్కగా పాల్గొంటారు. శరీరారోగ్యం చక్కగా ఉండదు. దూరప్రయాణాలు తృప్తినిస్తాయి. సోదరులతో అభిప్రాయభేదావకాశాలు. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులు చాలా మెలకువగా నడుచుకోవాలి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ప్రణాళికాబద్ధంగా పనులు చేసి పేరు తెచ్చుకొంటారు.




కొంత ప్రయత్నం తర్వాతనే వివాహాది పనులు సాగుతాయి. దైవకార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. వ్యాపారులకు లాభాలలో కొంత వృద్ధి ఏర్పడవచ్చు. అయినా అధిక ఖర్చులు మనసును కుంగతీస్తాయి. నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు.




శరీరారోగ్యం ఇబ్బంది పెడుతుంది. దైవ కార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. విద్యా కళా రంగాలలో ప్రసిద్ధి పొందుతారు. వ్యాపారులకు లాభాలలో కొంత కోత ఏర్పడవచ్చు. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. నిలిచి నిదానంగా అడుగేయాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమ అధికం.

## పంచాంగం

22తేది ఆరుద్ర కార్తె ప్రారంభం.

**శుభ ముహూర్తాలు**

19, 20, 25 తేదీలలో వివాహాదులకు రా.2.00 నుండి 3.00 గంటల వరకు మేషలగ్నాన.

20,21,24 తేదీలలో అన్ని శుభకార్యాలకు ఉ.7.30 నుంచి 8.30 గంటల వరకు కర్కాట లగ్నాన శుభ ముహూర్తాలున్నాయి.

**జూన్ తిథులు**

**జ్యేష్ఠ శుద్ధ**

| | | | |
|---|---|---|---|
| 19 శని | అష్టమి | రా.8.46 | గం.ల.వ |
| 20 ఆది | నవమి | రా.7.00 | గం.ల.వ |
| 21 సోమ | దశమి | సా.5.34 | గం.ల.వ |
| 22 మంగళ | ఏకాదశి | సా.4.32 | గం.ల.వ |
| 23 బుధ | ద్వాదశి | సా.3.55 | గం.ల.వ |
| 24 గురు | త్రయోదశి | సా.3.44 | గం.ల.వ |
| 25 శుక్ర | చతుర్దశి | సా.4.02 | గం.ల.వ |

పి.ఎం.గోపాలాచారి
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com

# ఆగ్నేయ దోషం స్త్రీ వ్యాధి కారకం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*షేక్ ఇంతియాజ్ — ఒంగోలు*

* *ఆమె ఆరోగ్యాన్ని గురించే నా బెంగ. ఏం చేయమంటారో చెప్పండి?*

'ఆగ్నేయ దోషం స్త్రీ వ్యాధి కారకం' అన్నారు శాస్త్రంలో. వెంటనే సరిచేసుకోండి. లక్ష్మీగణపతి యంత్రం సర్వ అరిష్టాలను తొలగిస్తుంది. చెన్నై కాన్సర్ ఇనిస్టిట్యూట్‌లో ఆమెకొకమారు చెకప్ చేయించండి.

*జగన్నాటి రమణయ్య — నెల్లూరు*

* *ఇంట్లో ఎప్పుడూ ఆర్థికమో, అనారోగ్యామో వుంటుంది. ఎందువల్ల?*

పశువుల్ని నైరుతిలో వుంచడం, ఈశాన్యం వంట చేయడం, ఇంట్లో వాస్తు లేకపోవడం కారణం. వాస్తుయంత్రం(ఉత్తమార్థం) ప్రతిష్ట చేయండి.

*ఎన్.పరమేశ్వరరావు — రాపూరు*

* *ఆవిడ ఆరోగ్యం చెడిపోయింది. ఇంటి పనులు కూడా నేనే చేయవలసివస్తోంది.*

తూర్పు 'సింహద్వారం' దోషం. దక్షిణ గదుల దోషం చాలా ఎక్కువగా వున్నాయి. పశ్చిమ ద్వారం ఎత్తైనదిగా వుంది. దాన్ని తూర్పున, తూర్పు ద్వారాన్ని పశ్చిమంలోనూ ఏర్పాటుచేయండి.

*కె.ఎన్.తిరుపతిరావు — విజయవాడ*

* *ఎప్పుడూ మానసికంగా బావుండదు. ఏదో ఒక సమస్య.*

వాయువ్యం సెప్టిక్‌ట్యాంకును వెంటనే తొలగించండి. నైరుతి వంటను మానేయండి. ఇంట్లో సుదర్శన యంత్ర ప్రతిష్ట చేయండి.

*పి.వైష్ణవిభాను — గూడూరు*

* *మా స్థలం పశ్చిమంవైపు వెడల్పు ఎక్కువగానూ, తూర్పువైపు తక్కువగానూ వుంటుంది.*

ఇలాంటి స్థలం 'బృహన్ముఖం' అంటారు. ధన, బంధు నాశనాన్ని, దారిద్ర్యాన్ని సంప్రాప్తింపజేస్తుంది. 'లక్ష్మీగణపతి' యంత్రప్రతిష్ట మేలు చేస్తుంది.

*కె.జాహ్నవిరెడ్డి — నెల్లూరు*

* *కృష్ణమందిరం దగ్గర వాస్తు ప్రకారం గృహనిర్మాణం చేశాను. అయినా ఎప్పుడూ ఏదో ఒక సమస్య.*

సరస్వతిలే - అవుట్‌లో వాయువ్య దోషాలెక్కువ. కోణవేధలు ముప్పిరిగొని వున్నాయి. వాస్తు సరి చేసుకోవడం లేదా, 'సుదర్శన' యంత్ర ప్రతిష్ట సమస్యలకు పరిష్కారం.

*వై.జనార్ధననాయుడు — బెంగుళూరు*

* *వివాహం, ఉద్యోగం ఆలస్యమవుతున్నాయి. మేమేమి చేయాలి?*

వాస్తు సరిదిద్దడం ఆలస్యమయే పక్షంలో 'లక్ష్మీకృతవాస్తు' యంత్రప్రతిష్ట చేయించండి.

*ఎం.ప్రకాష్‌రెడ్డి — నెల్లూరు*

* *అన్ని అర్హతలుండి కూడా కొన్ని ఓడలు బండ్లయిపోతాయి ఎందువల్ల?*

కర్మఫలం కొంత, వాస్తు దోషాలు మరి కొంత, జ్యోతిషం ప్రకారం శత్రుగ్రహాల విజృంభణ అన్ని కలిసి ఇలా జరుగుతుంది. శక్తి యంత్ర ప్రతిష్ట, సత్సంబంధ రత్నధారణ పరిస్థితిని చక్కదిద్దుతాయి.

*వి.శకుంతలాశాస్త్రి — హైదరాబాద్*

* *తూర్పు సింహద్వారం తర్వాత వరుసగా రెండు ద్వారాలున్నాయి.*

సింహద్వారం 4x7 ఏర్పాటు చేయండి. వరుస మూడు ద్వారాలు ముప్పు గనుక మధ్య ద్వారాన్ని తీసి వేసి 'ఆర్చ్' చేయండి.

*కె.ఆర్. రాజీవ్‌లోచన — సికింద్రాబాద్*

* *యంత్ర ప్రతిష్ట తర్వాత చాలా మనఃశాంతిగా వుంది.*

యంత్ర ప్రభావము, మీ నమ్మకమూ మీకు మేలు చేశాయి. అయినప్పటికి 'వైడూర్యధారణ' చేయండి.

*బండారు విశ్వనాధరెడ్డి — కడప*

* *ఆర్థిక ఆరోగ్య పరిస్థితుల నుండి మేము బయటపడతామా?*

నైరుతి సెప్టిక్ ట్యాంకు తొలగించి, ఈశాన్యం వంట మానివేయండి. వాస్తుయంత్ర (ప్రథమార్థ) ప్రతిష్ఠించండి.

# పంచాయితీ భవనం కూడా లేని ఉదయగిరి!



స్కూల్‌లో నడుస్తున్న ఉదయగిరి గ్రామ పంచాయితీ కార్యాలయం.

నియోజకవర్గ కేంద్రమైన ఉదయగిరి పంచాయితీలో పారిశుద్ధ్యం చాలా అధ్వాన్నంగా వుంది. దీంతోపాటు త్రాగునీటి సమస్యకూడా ప్రజల్ని పట్టిపీడిస్తుంది. గ్రామ పంచాయితీ పాలకవర్గం ప్రజలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలను పరిష్కరించడంలో పూర్తిగా వైఫల్యం చెందింది. ఈ పంచాయితీ మెట్టప్రాంతం కావడం కూడా ఇక్కడ ప్రజలకు శాపంగా మారింది. ఇతర గ్రామపంచాయితీలు అభివృద్ధి పథంలో దూసుక వెళ్తుండగా ఈ పంచాయితీ మాత్రం బాగా వెనుకబడిపోతున్నది. కనీసం సొంత భవనం కూడా లేక వేరే పాఠశాలలో నడుస్తుంది.

ఈ గ్రామ పంచాయితీ సర్పంచ్‌గా కాంగ్రెస్ పార్టీకి చెందిన సయ్యద్ నయీమ్ అక్తర్ అనే మహిళా గత పంచాయితీ ఎన్నికలలో గెలుపొందడం జరిగింది. ఈ పంచాయితీ పరిధిలో 20వేల జనాభా, 5వేల కుటుంబాలు వున్నాయి. పంచాయితీ పన్నుల రూపంలో 8లక్షల రూపాయలు వసూలవుతుంటాయి. ఇవి కాకుండా రాష్ట్రప్రభుత్వం నుంచి ఎస్.ఎఫ్.సి 12వ ఆర్థికసంఘ నిధులు కలిపి మరో 8లక్షల రూపాయల గ్రాంట్ల రూపంలో విడుదలవుతుంటాయి. ఈ నిధులతో పంచాయితీ పరిధిలో వివిధ అభివృద్ధి పనులు చేపట్టాల్సివుండగా పాలక వర్గం చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నది.

పంచాయితీ పరిధిలో వున్న ఎస్సీ, ఎస్టీ, బిసి కాలనీలలో రోడ్లు చాలా అధ్వాన్నంగా వున్నాయి. వీధులలో వేసిన చెత్తాచెదారాన్ని ప్రతి రోజు తొలగించకపోవడం, డ్రైనేజీ కాల్వలను శుభ్రం చేయకపోవడంతో మురికి కూపంలా మారి కనిపిస్తున్నాయి. త్రాగునీటి ఎద్దడి నివారణ కోసం బోర్లు ఏర్పాటుచేసినప్పటికి అవి నామమాత్రంగా కూడా పని చేయడం లేదు. ఉదయగిరికి సమీపంలో వున్న గండిపాళెం నుంచి పైపు లైన్ల ద్వారా నీటిసరఫరా జరగాల్సి వున్నా సక్రమంగా జరగడం లేదు. దీంతో పంచాయితీ పరిధిలోని ప్రజలు వాటర్ క్యాన్లను అధిక ధరలకు కొనుగోలు చేయాల్సి వస్తుంది.

గ్రామ పంచాయితీ సర్పంచ్ మహిళ కావడం వలన ఆమె సమస్యలపై దృష్టి సారించలేకపోతుంది. ఈమె చేయాల్సిన పనుల్ని భర్త చేస్తుంటాడు. పంచాయితీ పాలనపై సరైన అవగాహన లేకపోవడం, నిధుల్ని సక్రమంగా వినియోగించకపోవడం వంటి కారణాలతో ఇప్పటికి రెండు దఫాలు చెక్‌పవర్ రద్దయ్యింది. సర్పంచ్ భర్త తీసుకొనే నిర్ణయాల మూలంగా పాలకవర్గంలో అభిప్రాయ బేధాలు తలెత్తాయి. ఎన్నో సంవత్సరాల క్రింద నిర్మించిన పంచాయితీ భవనం శిథిలావస్థకు చేరుకుంది.

నూతన భవన నిర్మాణం కోసం పాలకవర్గం ఎటువంటి ప్రయత్నాలు కూడా చేపట్టడం లేదు. స్థానికంగా ఎమ్మెల్యే వున్నప్పటికి గ్రామ పంచాయితీకి అవసరమైన నిధుల్ని మంజూరు చేయించుకోవడంలోనూ సర్పంచ్ విఫలం చెందింది. ఈ క్రమంలో పంచాయితీలోని సమస్యలు, అభివృద్ధిపై సేకరించిన అభిప్రాయాన్ని ప్రక్కన ఇస్తున్నాం.

**నిధుల కొరత వుంది!**



గ్రామ పంచాయితీలో పారిశుద్ధ్యం మెరుగు పరిచేందుకు సిబ్బంది కొరత వుంది. ప్రభుత్వం పంచాయితీకి అవసరమైన సిబ్బందిని నియమించకపోవడంతో కాంట్రాక్టు ప్రాతిపదికన కొంతమంది సిబ్బందిని ఏర్పాటు చేసుకొని జనరల్ నిధుల నుంచి వేతనాలు చెల్లించడం జరుగుతుంది. త్రాగునీటి సరఫరా కోసం కూడా నా వంతు కృషి చేస్తున్నాను.

– **షేక్ సాబ్జాన్,** ఇన్‌చార్జ్ కార్యదర్శి



దుస్థితిలో డ్రైనేజి వ్యవస్థ.

అవినీతి కథ

● **నెల్లూరులో విఫలమైన**

# రాజీవ్ గృహ కల్ప!

**బడుగు బలహీన వర్గాల సొంతింటి కల తీర్చాలన్న వుద్దేశ్యంతో ఇరుగాళమ్మ గుడి ప్రాంతంలో ప్రభుత్వం అపార్టుమెంటుల రూపంలో కట్టించినా ప్రాథమిక సౌకర్యాలు లేకపోవడం వల్ల నేటికి పలువురు లబ్దిదారులు గృహ ప్రవేశం చేయలేకున్నారు.**



నెల్లూరులోని రాజీవ్ స్వగృహ సముదాయం.

బడుగు, బలహీన వర్గాల వారికి గృహవసతి కల్పించాలన్న లక్ష్యంతో రాజీవ్ గృహకల్పకు ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. అయితే ఈ పథకం అధికారులు, పాలకుల నిర్లక్ష్యం కారణంగా ఆదరణకు నోచుకోలేక పోయింది. ఆర్థికంగా కొంత వెసలుబాటు కలిగిన వారికి అపార్టుమెంటు రూపంలో భవనాలు నిర్మించి సంవత్సరాలు గడుస్తున్నా నగర ప్రజలు వాటిలో ప్రవేశించేందుకు ఆసక్తి చూపడం లేదు. ఇళ్ల స్థలాల కొరత ఏర్పడడం వల్ల ఒకే ప్రాంతంలో అపార్టుమెంట్లు నిర్మించడం జరిగింది.

ఈ అపార్టుమెంటు నిర్మాణ బాధ్యతలను జిల్లా హౌసింగ్ బోర్డుకు ప్రభుత్వం అప్పగించడం జరిగింది. అయితే ఇక్కడ హౌసింగ్ బోర్డు ఇంజినీర్లు కాంట్రాక్టర్లతో కుమ్మక్కై నాసిరకంగా భవన నిర్మాణాలు చేపట్టారన్న ఆరోపణలు వున్నాయి. నగరంలోని వారికి అపార్టుమెంట్లలో గృహవసతి కల్పించేందుకు లబ్దిదారుల ఎంపిక బాధ్యతలను నగర మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు తీసుకున్నారు. హౌసింగ్‌బోర్డు, మునిసిపల్ కార్పొరేషన్ అధికారుల మధ్య సరైన సమన్వయం, అవగాహన లేకపోవడంతో రాజీవ్ గృహకల్ప పథకం లక్ష్యం నెరవేరకుండా పోయింది.

నెల్లూరు నగరంలోని మూలాపేట ఇరుకళల పరమేశ్వరి ఆలయం సమీపంలో రాజీవ్‌గృహ కల్ప పథకం క్రింద దాదాపు ఐదు సంవత్సరాల క్రితం నిర్మాణం చేపట్టారు. ఈ నిర్మాణానికి నగరంలోని కొన్ని బ్యాంకులు కూడా రుణ సదుపాయం కల్పించాయి. ఇంతకు ముందు ఎస్సీ, ఎస్టీల వారికి అంబేద్కర్ యోజన పథకం క్రింద రుణ సదుపాయాలు ఏవిధంగా కల్పించారో అదే రీతిలో రాజీవ్ గృహకల్ప పథకానికి బ్యాంకులు రుణాలు మంజూరు చేయడం జరిగింది. అపార్టుమెంట్లలో ఒక్క ప్లాటుకు 75వేల రూపాయలు ఖర్చు అవుతుందని తొలుత అధికారులు అంచనా వేయగా కాలక్రమంలో దాదాపు లక్ష రూపాయల వరకు ఖర్చు చేశారు.

లబ్దిదారులకు ప్లాట్లు కేటాయించిన తర్వాత బ్యాంకులకు 800 నుంచి 1000 రూపాయల వరకు వాయిదా పద్ధతిలో చెల్లింపులు జరపాల్సి వుంటుంది. అపార్టుమెంట్లు నిర్మించి సంవత్సరం గడిచినా కూడా వీటిలో నివాసం వుండేందుకు లబ్దిదారులు ముందుకు రాలేదు. దీంతో రుణ వసతి కల్పించిన బ్యాంకులపై ఆర్థిక భారం పడక తప్పలేదు. అధికారులు ముందుగా ప్రకటించిన దానికంటే భిన్నంగా భవనాలు నిర్మించారు. ఈ భవనాలలో నిర్మించిన గదులు చాలా ఇరుకుగా వున్నాయి. దీంతో చాలా మంది లబ్దిదారులు నేటికీ గృహ ప్రవేశం చేయలేక పోతున్నారు.

## పర్యవేక్షణ లోపం

రాజీవ్ గృహకల్ప పథకం కింద చేపట్టిన భవన నిర్మాణాలను పర్యవేక్షించడంలో హౌసింగ్ బోర్డు అధికారులు చాలా నిర్లక్ష్యంగా వ్యవహరించారు. నిర్మాణాల కోసం వినియోగించిన స్టీల్, సిమెంటు నాణ్యతా ప్రమాణాలకు అనుగుణంగా లేకపోవడంతో కొన్నినెలలకే గోడలు పగుళ్ల బారిన పడ్డాయి. ప్రభుత్వం ఏ ఉద్దేశ్యంతో వాటి నిర్మాణాలకు శ్రీకారం చుట్టిందో అవి పూర్తిగా నెరవేరకుండా పోయాయి. భవనాల గురించి ప్రశ్నిస్తే మునిసిపల్, హౌసింగ్ బోర్డు అధికారులు ఒకరిపై మరొకరు చెప్పుకుంటున్నారు.

గోడలు పగుళ్లు బారడం, వర్షం కురిస్తే స్లాబ్ నుంచి నీరు కారడం జరుగుతుంది. ఈ విషయాన్ని పలుమార్లు అధికారుల దృష్టికి తీసుకెళ్లినా ఎవరు పట్టించుకోవడం లేదని లబ్దిదారులు వాపోతున్నారు. రుణాల రికవరీ కూడా సక్రమంగా లేనందున బ్యాంకు అధికారులు లబ్దిదారులపై ఒత్తిడి తెస్తున్నారు. కొన్ని అపార్టుమెంట్లలో అనేక గృహాలు నేటికి ఖాళీగానే వున్నాయి. రాత్రి సమయంలో ఖాళీగా వున్న ప్లాట్లలో అసాంఘిక కార్యకలాపాలు జరుగుతున్నాయి. ఇప్పటికైనా హౌసింగ్ బోర్డు, మునిసిపల్ అధికారులు స్పందించి రాజీవ్ గృహకల్ప పథకం క్రింద నిర్మించిన గృహాలపై దృష్టి సారిస్తే బాగుంటుంది.






# ఆకట్టుకోని 'పంచాక్షరి'!

అల్లూరు రహీం

అరుంధతి చిత్ర విజయం తర్వాత హీరోయిన్ అనుష్కకు వచ్చిన క్రేజ్‌ను ఉపయోగించుకోను సాయిరత్న క్రియేషన్స్ పతాకంపై హీరో నాగార్జున మేకప్ మ్యాన్ బొమ్మదేవర రామచంద్రరావు నిర్మాతగా వ్యవహరించి తీసిన చిత్రమే పంచాక్షరి. ఈ చిత్రానికి నాగార్జున సమర్పకునిగా వ్యవహరించారు. వాస్తవానికి అరుంధతికి, పంచాక్షరి చిత్రానికి నక్కకు నాగలోకానికి ఉన్నంత తేడా వుంది. అరుంధతి చిత్రంలోని అద్భుతమైన గ్రాఫిక్స్, ఆ రోజుల్లో ఆ తరహా చిత్రం కొత్తది కావడంతో కాసుల వర్షం కురిసింది. పంచాక్షరిలో గ్రాఫిక్స్ గోరంతే. అవీ గొప్పగా లేవు. దర్శకుడు వి.సముద్ర ఫ్యాక్షన్ చిత్రాలను బాగా తీయగలడేమో గానీ సోషియో ఫాంటసీ చిత్రమైన పంచాక్షరిని తీయడంలో విఫలమయ్యాడు. ఈ చిత్ర ప్రారంభంలో విలక్షణత కోసం డైలాగ్ కింగ్ మోహన్‌బాబు గొంతుతో దైవశక్తి గొప్పతనాన్ని చెప్పించాడు. ప్రేక్షకులకు రిలీఫ్ ఇవ్వను బ్రహ్మానందం – అలీ కాంబినేషన్‌లో పెట్టిన కామెడీ ట్రాక్ ఫట్ మంది. అనుష్క చేత చుక్కేస్తే... లక్కేలే చరణంతో సాగే మాస్ పాటతోపాటు యోగాసనాలు అలవోకగా వేయించినా ప్రయోజనం లేకుండా పోయింది. సంగీత దర్శకుడు చిన్నా మాత్రం మంచి నేపథ్య సంగీతమందించి ఆకట్టుకొంటే కెమెరామెన్ వాసు సన్నివేశాల్లో కొత్తదనం చూపడంలో విఫలమయ్యాడు. చిత్రంలోని చివరి సన్నివేశం 'అమ్మోరు' చిత్రంలోని సన్నివేశాన్ని కాపీ చేసినట్లుంది. పంచాక్షరి వంటి ఘనమైన పేరు పెట్టి తీసిన ఈ చిత్రంలో మాంత్రికుడు కుండలీకుని పాత్ర పాలిపోయింది. డ్రామా స్టేజిపై మేకప్ చేసుకొన్న మాయలఫకీరులా అతని పాత్ర పోషణ సాగింది. చిత్రంలోని కొన్ని డైలాగులు మాత్రం ప్రేక్షకులను ఆకట్టుకొంటాయి. పెళ్లి ఫిగర్ వున్నప్పుడు చేసుకోవాలి... షుగర్ వచ్చాక కాదు. కత్తి పట్టిన వాడికి భయం, భక్తి వుండకూడదు. కష్టపడి కట్టుకొన్న ఇల్లు గుడికన్నా గొప్పది ఈ కోవలోనివే. కథ, స్క్రీన్‌ప్లే నడత పట్ల శ్రద్ధ, ఇంకాస్త గ్రాఫిక్ పనితనం వెండితెరపై చూపి వుంటే పంచాక్షరి కూడా కాసుల వర్షం కురిపించేదే.




చిత్రకథలోనికి వెళ్తే జనగాం అభయ దుర్గాదేవి సన్నిధిలో చంద్రమోహన్ దంపతులకు పుట్టిన పాపకు పంచాక్షరి అని పేరు పెడతాడు ఆలయ పూజారి. పెరిగి పెద్దయ్యే పంచాక్షరి(అనుష్క) అంటే గ్రామంలో ప్రత్యేక అభిమానం. బోనాల పండుగ సందర్భంగా అభయ దుర్గాదేవి పంచాక్షరిని ఆవహిస్తుంది. ఈ సమయంలో ఆమె పలికే పలుకుల కోసం గ్రామస్తులు ఎదురు చూస్తుంటారు. ఈ సమయంలోనే గ్రామానికి వచ్చే యువకుడు శ్రీరామ్ (సామ్రాట్) పంచాక్షరి తనకు నచ్చిందని గ్రామపెద్దల ముందు చెప్పడంతో వాళ్లంతా కలసి ఆమె వివాహాన్ని వేడుకగా జరిపిస్తారు. అభయ దుర్గాదేవి ఆలయంలోని విలువైన నిధి నిక్షేపాలకోసం బోనాల పండుగ రోజు గ్రామ పెద్ద(ప్రదీప్‌రావత్) పంచాక్షరిని ఓ పథకం ప్రకారం అంతమొందిస్తాడు. దేవాలయం మూతబడేలా చేస్తాడు. పంచాక్షరి మరణంతో శ్రీరామ్ తన కుమార్తెతో సహా హైదరాబాద్ వెళ్లిపోతాడు. అక్కడ ఫ్యాషన్ డిజైనర్ హనీ(అనుష్క) పంచాక్షరిని పోలినట్లుండడం గమనించి ఆమెకు తమ కుటుంబగాథను వివరిస్తాడు. శ్రీరామ్ కోరికపై హనీ జనగాం పయనమౌతుంది. పంచాక్షరి తన చిన్నాన్న కుమార్తె అని తెలుసుకొంటుంది. దేవస్థానంలో అపురూప సంపదను పెకిలించను మాంత్రికుడు కుండలీకుడు వస్తాడు. పంచాక్షరి ఆత్మ హనీని ఆవహిస్తుంది. బోనాల పండుగ రావడంతో గ్రామస్తులంతా పంచాక్షరి ప్రాణాలు విడిచిన చోట పసుపు ముద్దలతో ఆమె ప్రతిమ తయారుచేస్తారు. మాంత్రికునితోపాటు, ప్రదీప్‌రావత్ చేసే దైవధూషణతో ప్రతిష్టించిన పసుపు ముద్ద నుంచి పంచాక్షరి రూపంలో అమ్మవారు ప్రత్యక్షమై దుష్ట సంహారం చేయడంతో చిత్రం ముగుస్తుంది.

రౌద్ర పంచాక్షరిగా అనుష్క దగ్గర నటన రాబట్టడంలో దర్శకుడు విఫలమయ్యాడు. కొత్త హీరో సామ్రాట్ పేలవంగా వున్నాడు. ప్రదీప్‌రావత్ పాత్ర పోషణ రొటీన్‌గానే వుంది.

## నమితకు పెరిగిన అభిమానులు!



గుజరాతీ అయినా హీరోయిన్ నమిత తమిళనాడు జనాల మనోభావాలకు తగ్గట్టుగా నడుచుకొని వారి అభిమానం మరింతగా పొందింది. శ్రీలంకలో నిర్వహించిన ఐఐఎఫ్ఏల అవార్డుల వేడుకకు హాజరుకమ్మంటూ నమితకు ఆహ్వానం అందింది. అయితే నమిత మాత్రం శ్రీలంక వెళ్లేందుకు సుతరామూ ఇష్టపడ లేదు. అంతే కాకుండా ఓ ప్రకటనతో తమిళ తంబీల మనసు దోచింది. ఐఐఎఫ్ఏ వాళ్లు తమ కార్యక్రమానికి శ్రీలంక రమ్మన్నారు. అయితే నేను తమిళ ప్రజల మనోభావాలకు విలువనిస్తాను. ఆ దేశంలో మానవ హక్కుల ఉల్లంఘన జరిగింది. అక్కడివాళ్ల కిరాతకానికి ఎందరో తమిళ జనాలు బలైపోయారు. అందుకే ఆ దేశం వెళ్లలేనంది. నమిత ప్రకటనను తమిళనాడులోని రాజకీయపార్టీలు, శ్రీలంక తమిళులకు మద్దతిచ్చే సంఘాలు స్వాగతించాయి.

## నాజూగ్గా వుండాలి!



సినిమాలో నటించాలంటే నాజుకుగానే వుండాలంటుంది సీనియర్ హీరోయిన్ రోజా. ఇటీవల శంభోశివశంభో, గోలిమార్ చిత్రాల్లో నటించిన ఆమె నవ్వత వుంటే చిన్న పెద్ద సినిమాలనే భేదం లేకుండా నటిస్తానంటుంది. ఈ విషయమై మాట్లాడుతూ మల్టీస్టారర్ సినిమాల్లో ఎక్కువగా నటించిన కథానాయికను నేనే. రాజకీయాలకు గ్లామర్ అవసరం లేదు. సినిమాలో కచ్చితంగా అందంగా వుండాలి. అందుకే ఈ మధ్య కష్టపడి సన్నబడ్డానంటుంది. రోజా సన్నబడ్డా అవకాశాలు వస్తాయంటారా?

## మగువలకు అన్యాయమే!



వివాహానంతరం కూడా హీరోయిన్ భూమిక కొన్ని సినిమాలు స్వంతంగా తీస్తుంది. కొన్నింటిలో నటిస్తుంది. కలెక్టర్ గారి భార్య షూటింగ్ గ్యాప్‌లో ఆ పాత్ర తాలుకు వుద్వేగం వల్ల కాబోలు ఆమె మాట్లాడుతూ ఈ 21వ శతాబ్దంలోనూ స్త్రీలకు రక్షణ లేదు. నిత్యం మహిళలపై అత్యాచారాలే. దగాపడ్డ వాళ్లను కాపాడేవారే లేరు. సౌదీ అరేబియా, ఆఫ్ఘనిస్తాన్ లాంటి దేశాల్లో మహిళలు ఇంకా అణగారిన దశలోనే వున్నారంది. పాత కథలే మళ్లీ మళ్లీ వినిపిస్తున్నందున కొత్త సినిమాల పట్ల ఆసక్తి కల్గడం లేదని భూమిక చెప్పుకొచ్చింది.

## తమన్నాపై విమర్శల జడివాన!



త్రిష, అసిన్‌లను దాటుకొని తమిళ చిత్రరంగాన్ని ఏలేద్దామనుకొన్న తమన్నా ఆశలకు బ్రేక్ పడినట్లు భావించాల్సిందే. ఎందుకంటే తమిళ దర్శకులు తమన్నాని లక్ష్యంగా చేసుకొని విమర్శలు గుప్పిస్తున్నారు. అసలు తమన్నా హీరోయిన్‌నే కాదు. ఏదో అదృష్టం కొద్ది సినిమాలు ఆడుతున్నాయి అంతే. ఆమెలోని ప్రతిభ శూన్యమంటూ దుమ్మెత్తి పోస్తున్నారు. సోలై రాజా అనే దర్శకుడైతే తమన్నాది అసలు అందమే కాదు. నా దృష్టిలో హీరోయిన్‌కి వుండవలసిన లక్షణాలు ఆమెలో ఏమాత్రం లేవన్నాడు. కొన్ని సినిమాలు హిట్ కాగానే తమన్నా పారితోషికం అమాంతంగా పెంచేయడంతో తమన్నాపై తమిళ సినీవర్గాలు గుర్రుగా వున్నాయి. దీనిపై తమన్నా మాట్లాడుతూ రెండు సినిమాలు ఒకేసారి తీసుకరండి... రిబేటు ఇస్తానన్న ఆఫర్ ఇచ్చింది. ఈ మాట తమిళ నిర్మాతలను ఇంకాస్త మండించింది.

## తొందరపడను!




నటి శ్రియలో మధనం మొదలయ్యింది. అదే నమిటంటే ఇన్నాళ్లూ అందాలు ఆరబోసి మాస్‌ని మెప్పించాను. ఇక నటిగా తానేంటో నిరూపించుకోవాల్సిన తరుణం ఆసన్నమైందంటుంది. తెలుగు, తమిళ, హిందీ, మళయాళ భాషల్లో నటిస్తున్న శ్రియ అభినయ ప్రాధాన్యం వున్న పాత్రల కోసం ఆశగా ఎదురుచూస్తోంది. ఇకపై తొందరపడి సినిమాలు ఒప్పుకోనని ఆచితూచి ఎంపికలు చేసుకొంటానంటుంది. అయినా మనలో మాట... శ్రియకు అంతగా అవకాశాలున్నాయా?

# పెన్నా బ్యారేజి పనులకు మంగళం!

రాష్ట్ర ప్రభుత్వం జలయజ్ఞం ప్రాజెక్టుల క్రింద ఎంతో అట్టహాసంగా ప్రారంభించిన పెన్నా బ్యారేజ్ పనులకు ప్రభుత్వమే మంగళం పాడిందని సిపిఎం రాజ్యసభ సభ్యుడు పి.మధు విమర్శించారు. టౌన్‌హాలులో ప్రజా సంఘాల ఆధ్వర్యంలో జరిగిన ప్రజా సమస్యల సదస్సుకు ఆయన ముఖ్యఅతిథిగా హాజరై ప్రభుత్వ విధానాన్ని తూర్పార బట్టారు. పెన్నా నది వద్ద ప్రారంభించిన పనులు అర్ధాంతరంగా నిలిచి పోయాయని, మొదటి ప్రాధాన్యత అంశం క్రింద ప్రభుత్వం ప్రకటించిన జాబితాలో నెల్లూరు బ్యారేజ్ లేకపోవడంలోనే ఈ విషయం స్పష్టమైపోతున్నదని వ్యాఖ్యానించారు.

## అర్ధాంతరంగా నిలిచిన పనులు

నగరంలో ప్రజా సమస్యలు పరిష్కారం కావడం లేదని, తప్పుడు ప్రకటనలు, హామీలతో ప్రజలను పాలకులు మోసం చేస్తున్నారని తీవ్రంగా విమర్శించారు. 30వేల మందికి ఇళ్లు కట్టించి ఇస్తామన్న నేతలు వైఎస్ఆర్ నగర్‌లో కేవలం ఎనిమిది వేల మందికి మాత్రమే ఇళ్లు నిర్మించారని, మిగతా వారి పరిస్థితి ఏమిటని ప్రశ్నించారు. ఆర్భాటంగా సమావేశాలు పెట్టి మరో 7,500 మందికి ఇళ్ల పట్టాలు పంపిణీ కార్యక్రమం చేపట్టిన ఎమ్మెల్యేలు ఇప్పటివరకు లబ్ధిదారులకు ఇళ్ల స్థలాలు చూపించలేదని అలాంటప్పుడు హామీలు ఇవ్వడం ఎందుకని ఆగ్రహం వ్యక్తం చేశారు. చివరకు రైతులను దగా చేశారని ఆరోపించారు. నెల్లూరు సన్నాలు వేసుకొంటే ప్రోత్సహిస్తామన్న పాలకులు, అధికారులు నేడు రైతులను నట్టేట ముంచారని, వీరి కారణంగా రైతులు తీవ్రంగా నష్టపోయారన్నారు. ప్రజలకు న్యాయం జరిగే వరకు సిపిఎం పక్షాన అండగా వుంటామని ప్రకటించారు. ఈ సమావేశంలో డిప్యూటీ మేయర్ మాదాల వెంకటేశ్వర్లు, మోహన్‌రావు, పౌర సంఘం రాష్ట్ర నేత శ్రీనివాస్, కార్పొరేటర్లు షాహినా, మస్తాన్‌బీ, కత్తి శ్రీనివాసులు, ఐద్వా నేతలు అన్నపూర్ణమ్మ, రమమ్మ తదితరులు పాల్గొన్నారు.


ముందుకు కదలని బ్యారేజి పనులు.



కలెక్టరేట్‌లో జరిగిన బ్యాంకర్ల సమావేశంలో మంత్రి రామనారాయణరెడ్డి.

# జిల్లా రుణ ప్రణాళిక రూ.2840 కోట్లు!

జిల్లాలోని వివిధ బ్యాంకుల రుణ ప్రణాళికను విడుదల చేశారు. 2010 – 11 ఆర్థిక సంవత్సరానికి సంబంధించి 2840 కోట్ల రూపాయలను వివిధ పథకాలకు అందించాలని నిర్ణయించారు. ఇటీవల జిల్లా లీడ్ బ్యాంకు ఆధ్వర్యంలో ఏర్పాటుచేసిన సమావేశంలో పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి రుణ ప్రణాళికకు సంబంధించిన బుక్‌లెట్‌ను ఆవిష్కరించారు. గత సంవత్సరం రుణ ప్రణాళిక 2325.93 కోట్లు కాగా ఈ సంవత్సరం దాదాపు 500 కోట్లు అదనంగా రుణాలు పంపిణీ చేయాలని నిర్ణయించారు. వీటిలో వ్యవసాయ రుణాలు 310.14 కోట్లు, పంట రుణాలు వెయ్యి కోట్లు, స్వయం సహాయక సంఘాలకు 300 కోట్లు, ఇతర ప్రాధాన్యత రంగాలకు 354 కోట్లు, ప్రాధాన్యత లేని రంగాలకు 575.27 కోట్లు అందించాలని లక్ష్యంగా పేర్కొన్నారు. జిల్లాలో మొత్తం రుణ ప్రణాళికను బ్యాంకుల వారీగా కేటాయించబడింది.

**చింతా క్లాస్**

జిల్లా లీడ్ బ్యాంకు ఆధ్వర్యంలో జరిగిన బ్యాంకు అధికారుల సమీక్షా సమావేశానికి ముఖ్య అతిథిగా హాజరైన తిరుపతి ఎమ్పీ చింతామోహన్ తనదైన శైలిలో ఉపన్యసించారు. బ్యాంకులు ఏ విధంగా ప్రజలకు రుణాలు అందిస్తే పేద ప్రజలు ఆర్థికంగా ఎదుగుతారన్న విషయంపై దాదాపు 30 నిమిషాలు వివరంగా మాట్లాడారు.

# గురుకుల ప్రవేశాలపై సందిగ్ధం!

ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా నిర్వహించే గురుకుల పాఠశాలల్లో ప్రవేశ పరీక్షకు చిక్కులు వచ్చిపడ్డాయి. ఈ పాఠశాలల్లో చేరేందుకు ప్రభుత్వం ప్రతి ఏడాది ఉమ్మడి ప్రవేశ పరీక్షను నిర్వహిస్తుంది. ఈ ఏడాది జరుగనున్న పరీక్షలను ప్రభుత్వం రద్దు చేయడంతో దీనిలో చేరేందుకు సంసిద్ధులై వున్న విద్యార్థులు, వారి తల్లితండ్రుల్లో అయోమయం నెలకొంది. ప్రవేశ పరీక్ష నిర్వహిస్తారా? లేదా? అనే దానిపై విద్యార్థుల్లో సందిగ్ధత నెలకొంది. జిల్లావ్యాప్తంగా మొత్తం 1680 మంది విద్యార్థులకు ఈ ప్రవేశ పరీక్ష ద్వారా ప్రవేశం లభిస్తుంది. విద్యాశాఖ ద్వారా 560 సీట్లు, సాంఘిక సంక్షేమ శాఖ ద్వారా 960, గిరిజన సంక్షేమ శాఖ ద్వారా 160 సీట్లు భర్తీ అవుతాయి ప్రతి ఏడాది. ఈ పరీక్షకు 6036 మంది విద్యార్థులు దరఖాస్తు చేసుకొన్నారు. గత నెలలోనే ఈ పరీక్ష జరగాల్సి వుండగా ప్రభుత్వం రద్దుచేస్తూ ఉత్తర్వు ఇవ్వడంతో విద్యార్థులు దిక్కుతోచని స్థితిలో వున్నారు. ఐదవ తరగతిలో ప్రవేశించే విద్యార్థులకు పదవ తరగతి వరకు ఇక్కడే విద్యను అందిస్తారు. దీనికి సంబంధించి విద్యాశాఖ ఆధ్వర్యంలో ఏడు పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ 12 పాఠశాలలు, గిరిజన సంక్షేమశాఖ మూడు పాఠశాలలను నిర్వహిస్తోంది. ప్రభుత్వం ఈ ఏడాది అసలు పరీక్ష నిలిపేస్తుందా అనే దానిపై విద్యార్థుల్లో పలు సందేహాలు వ్యక్తమవుతున్నాయి. అధికారులు మాత్రం పరీక్ష నిర్వహణకు సంబంధించి ఎలాంటి సమాచారం రాలేదని, వచ్చిన వెంటనే నిర్వహిస్తామని చెప్తున్నారు.

# ప్రభుత్వ స్కూళ్లలో తిష్టవేసిన సమస్యలు!


దుస్థితిలో మూలపేటలోని రామయ్య బడి.

జిల్లాలో మండల జిల్లా పరిషత్, మునిసిపల్ పాఠశాలల్లో ఈ ఏడాది విద్యార్థులకు పాత సమస్యలే నేస్తాలుగా మారనున్నాయి. శిథిలమైన పాఠశాలలు, సౌకర్యాల లేమి, ఉపాధ్యాయుల ఖాళీలు గత కొన్నేళ్లుగా విద్యాశాఖను పట్టిపీడిస్తున్నాయి. ఏ ఏటికి ఆ ఏడు మెరుగైన సౌకర్యాలు కల్పిస్తామని, టీచర్ పోస్టులు భర్తీ చేస్తామని చెప్తున్నా ఆచరణలో అమలు కావడం లేదు. జిల్లాలో 2,666 ప్రాథమిక, 526 ప్రాథమికోన్నత, 332 ఉన్నత పాఠశాలలున్నాయి. వీటిలో అనేక పాఠశాలల్లో విద్యార్థులకు సరిపడా తరగతి గదుల్లేవు. త్రాగునీరు, మరుగుదొడ్ల సౌకర్యాలు అసలే లేవు. రాజీవ్ విద్యామిషన్ ఆధ్వర్యంలో అదనపు గదులు నిర్మిస్తున్నా నాణ్యత లోపించడంతో కట్టిన కొద్దికాలానికే నిరుపయోగంగా మారుతున్నాయి. మరోవైపు గతానికి భిన్నంగా ఈ సంవత్సరం పాఠశాల ప్రారంభానికి ముందే పాత పుస్తకాలను అందించగలిగినా విద్యార్థులకు సరిపడా రాలేదు. అదేవిధంగా హిందీ, తెలుగు, గణితం సబ్జెక్టులకు సంబంధించి ఉపాధ్యాయుల ఖాళీలు భర్తీ కావాల్సి వుంది. ఈ నేపథ్యంలో విద్యార్థులు పాఠశాలలకు వెళ్లినా ప్రయోజనం ఏమిటన్నది పలువురు వ్యక్తం చేస్తున్న అభిప్రాయం.

## గురి చూసి కాల్చేయత్నం

మొదటి పేజీ కొరవ

వైఎస్ హయాంలో జలయజ్ఞం టెండర్లు, కాంట్రాక్టర్ల ఎంపిక, వారి బిల్లుల లావాదేవీలన్నీ కెవిపి.రామచంద్రరావు చూసేవాడన్న సంగతి అందరికీ తెలుసు. కాంట్రాక్టర్ల నుంచి కమీషన్లు రాబట్టే బాధ్యత కూడా తన స్నేహితుడికే అప్పచెప్పాడు వైఎస్. ఆయన మరణం తర్వాత కొంత కాలం రోశయ్య వీటికి దూరంగా వున్నారు. బిల్లుల చెల్లింపు సమయంలో కొందరు కాంట్రాక్టర్లు అలవాటు ప్రకారం కమీషన్ ఇవ్వబోతే నిరాకరించారాయన. అయితే తర్వాత కాలంలో కెవిపి రామచంద్రరావు, రోశయ్య బాగా దగ్గరయ్యారు. వీరిద్దరి బంధంతో జలయజ్ఞం కమీషన్ల భాగోతం మళ్లీ మొదలైంది. వైఎస్ వున్నప్పటి వలెనే, రోశయ్య తరపున కూడా కాంట్రాక్టర్ల కష్టసుఖాలు చూసే బాధ్యత కెవిపి తీసుకొన్నారు.

అసలు సమస్య ఇక్కడ మొదలైంది. పోలవరం ప్రాజెక్ట్ అంచనా వ్యయం మూడువేల కోట్ల మేర పెరిగింది కాబట్టి, అంతమేర ఆ టెండర్ దక్కించుకొనే కొత్త కాంట్రాక్టర్లు ముడుపులు సమర్పించనున్నారన్న సమాచారం తెలంగాణ సీనియర్లకు ఆశ పుట్టించింది. ఆ ముడుపులలో తమకూ వాటా కావాలన్నది వీరి పరోక్ష కోరిక. జగన్ నుంచి వచ్చిన రాజకీయ ఒత్తిళ్ల సమయంలో రోశయ్యకు అండగా నిలబడిన తమను ఎవరూ పట్టించుకోవడం లేదని వాపోతున్నారు వీరు. కెవిపి.రామచంద్రరావు ముఖ్యమంత్రి చెంత చేరి, కమీషన్ల వ్యవహారం మొత్తం తన హస్తగతం చేసుకొని, తమ నోరు కొడుతున్నారన్నది వీరి ఆవేదన.

నేరుగా కెవిపి పేరు ప్రస్తావించి విమర్శించే అవకాశం లేదు కాబట్టి, దాని వల్ల రోశయ్యకు కూడా నష్టం జరుగుతుంది కాబట్టి, పొన్నాల లక్ష్మయ్య పేరు తెర మీదకు తెచ్చారు. నిజానికి జలయజ్ఞం మంత్రి పొన్నాల అయినా, దాని కమీషన్లలో ఆయన వాటా చాలా కొంచమని సీనియర్లకు బాగా తెలుసు. కానీ చావుకు పెడితే లంఖణానికి వస్తుందనే ఆశతో పొన్నాల భుజం మీద తుపాకీ పెట్టి కెవిపిని గురి చూసి కాల్చడానికి ప్రయత్నిస్తున్నారు వీరు.

ఈ ప్రయత్నంలో ముఖ్యమంత్రి రోశయ్య పరోక్ష ప్రమేయం కూడా వుందని మరొక వాదన. ఇటీవల జలయజ్ఞం పనుల మీద సమీక్ష జరిపాడు ముఖ్యమంత్రి. ఆ సమీక్షలో ప్రాణహిత – చేవెళ్ల ప్రాజెక్ట్ కూడా వుంది. సర్వే కూడా జరపక ముందు టెండర్లను పిలిచి, కాంట్రాక్టర్లకు వందలాది కోట్ల రూపాయలు మొబిలైజేషన్ అడ్వాన్సులుగా చెల్లించారని తెలుసుకొని చాలా ఆవేదన చెందారాయన. ఈ మొబిలైజేషన్ అడ్వాన్స్ మొత్తం, కెవిపి ద్వారా వైఎస్ కుటుంబానికి చేరిందని తెలిసి మరీ కడుపు మండిపోయింది. పోలవరంలో కూడా ఆ తీరులోనే వేలకోట్ల రూపాయల ముడుపులు కెవిపికి చేరనున్నాయని కొందరు ఇంజనీర్లు ముఖ్యమంత్రి చెవిలో వేశారు. ఇంతపెద్ద మొత్తంలో జరిగే కమీషన్ల భాగోతాన్ని తనకు ముందుగా వివరించి చెప్పనందుకు పొన్నాల లక్ష్మయ్య మీద బాగా కోపగించుకొన్నారు ముఖ్యమంత్రి. నీళ్ల శాఖ మొత్తాన్ని ఇక నుంచి తానే పర్యవేక్షించాలన్న తలంపుతోనే, పొన్నాల ప్రాధాన్యత తగ్గించడం కోసమే సీనియర్ల చేత ఈ గోల చేయించారని చెప్తున్నారు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

కార్మికుల పిల్లలకు క్రష్ కేంద్రాలు, పాఠశాలలు, అనాధలకు పునరావాస సంస్థలు ఎన్నో నిర్వహించి, జీవిత కాలం సంఘ సేవలో తరించిన పెనుబల్లి జనార్ధనరావు 3తేది పరమపదించారు. అరవైఏళ్ల క్రితమే మద్రాసు పచ్చయ్యప్పా కాలేజీలో ఎంఏ చదివిన విద్యావంతుడాయన. డాక్టర్ రాజమ్మ ప్రేరణతో ప్రభుత్వ ఉద్యోగాలు వదలి పెట్టి, సంఘసేవలో నిమగ్నుడై, తుది శ్వాస వరకు అదే లోకంగా బ్రతికాడు. ఆయన బ్రహ్మచారి.

***

ఇందుకూరుపేట మండలం గంగపట్నం వాసి, రిటైర్డ్ ఎల్ఐసి మేనేజర్ డి.స్వామినాయుడు 7తేది మరణించారు. ఆయనకు భార్య, ఒక కుమారుడు, ఐదుగురు కుమార్తెలు వున్నారు.

ఆత్మీయులను కోల్పోయిన పై కుటుంబీకులకు మా సానుభూతి.



## దూతల దురవస్థ

మొదటి పేజీ కొరవ

ఓదార్పు యాత్ర వాయిదా వేసుకొన్నాను కాబట్టి, తన గౌరవం కాపాడడానికి అధిష్టానం జూలై 8 నుంచి తాను తలపెట్టిన శ్రీకాకుళం యాత్రకు అనుమతి ఇవ్వాలన్నది జగన్ పట్టుదల. అనుమతి వచ్చినా రాకపోయినా జూలై 8తేది యాత్ర జరిపేది ఖాయమన్న నిర్ణయంతో వున్నాడు జగన్. ఇటువంటి తేదీలు, గడువులు అధిష్టానానికి రుచించే విషయాలు కావు. జూలై 8తేది లోపల అధిష్టానం అనుమతి అన్నది జరిగే పని కాదు. మరొకప్రక్క సోనియాగాంధీ కాంగ్రెస్ అధ్యక్షురాలిగా పెత్తనానికి వచ్చిన తర్వాత పార్టీ నుంచి తిరుగుబాటు చేసిన వారెవ్వరూ లేరు. శరద్‌పవార్, మమతా బెనర్జీ, జికె.మూపనార్, సంగ్మా వంటి వారంతా పివి.నరసింహారావు హయాంలో పార్టీ నుంచి బయటకు పోయిన వారే. సోనియాగాంధీ వచ్చిన తర్వాత, వారందరినీ ఏదో ఒకరకంగా పార్టీకి దగ్గర చేశారు తప్ప, మరే నేతనూ దూరం చేసుకోలేదు. రాష్ట్ర స్థాయిలో పలుకుబడి కల్గిన నేతలు పార్టీ మీద తిరుగుబాటు చేస్తే వచ్చే పరిణామాలు ఏమిటో ఆమెకు అనుభవం లేదు. తనకు, తన కుమారుడికి వున్న జనాకర్షణ ముందు, రాష్ట్రస్థాయి నేతల పలుకుబడి లెక్కలోనిది కాదనే అభిప్రాయం వారిలో వుంది. అందువల్లనే వారు జగన్ సమస్యను ఆ కోణంలో నుంచి ఆలోచన చేయలేకపోతున్నారు.

ఈ నేపథ్యంలో ముందుకు పోవాలో, వెనక్కు రావాలో అర్థంకాక తలలు పట్టుకొంటున్నారు జగన్ దూతలు. నేరుగా సోనియాగాంధీ వద్దకు వెళ్లే ధైర్యం లేక, గతంలో వైఎస్.రాజశేఖర్‌రెడ్డితో సన్నిహితంగా మెలిగిన కేంద్రమంత్రులు, ఇతర రాష్ట్రాలకు చెందిన ఎమ్పీలను కలిసి, వారి సహాయం అర్థిస్తున్నారు. ఈ డొంక తిరుగుడు మార్గంలో రాయబారం ఎప్పటికి ఫలించేను అన్నది ప్రశ్న.

ఈ సమస్యకు పరిష్కారం జగన్ స్వయంగా ఢిల్లీ వెళ్లి, తన వాదన విన్పించి, ఓదార్పు యాత్రకు అనుమతి కోరడం ఒక్కటే. కానీ అందుకు జగన్ సిద్ధంగా లేడు. తాను ఢిల్లీ వెళ్తే, అధిష్టానాన్ని ప్రాధేయపడుతున్నానన్న వార్తలు వస్తాయని, దాని వల్ల తన రాజకీయ భవిష్యత్తుకు నష్టం జరుగుతుందని భయపడుతున్నాడు. ఢిల్లీ పెద్దలు తనను మొదటి నుంచి నిరాదరణకు గురి చేస్తున్నారని, తాను ఎన్ని మెట్లు తగ్గినా వారిలో ఇప్పట్లో మార్పు వస్తుందన్న ఆశ లేదని చెప్తున్నాడు. తన తండ్రి వలె ఇరవై ఏళ్లు, పాతికేళ్లు, అధిష్టానం అనుగ్రహం కోసం ఎదురుచూసే ఓపిక తనకు లేదని స్పష్టంగా చెప్తున్నాడు జగన్. ఆయన తల్లి, బావమరిది వంటి కుటుంబ సభ్యులు కూడా ఈ వాదనకు మద్దతు పలుకుతున్నారు. ఈ విషయంలో జగన్‌కు తన కుటుంబ మద్దతు సంపూర్ణంగా లభిస్తున్నది.

## ఆనం కుటుంబ నైజం

16వ పేజీ కొరవ

మంతా ఫ్లెక్స్ బోర్డులతో అలంకరిస్తున్నారు. వాటిలో ఒక్కదానిలోనైనా రాజశేఖర్‌రెడ్డి బొమ్మ వుంటే ఒట్టు. అటు రామనారాయణరెడ్డి కానీ, ఇటు వివేకానందరెడ్డి కానీ పాల్గొనే సభలలో పొరపాటున కూడా వైఎస్ పేరు ప్రస్తావనకు రావడం లేదు. మరీ విచిత్రమేమిటంటే, కేంద్ర విద్యామంత్రిణి దగ్గుపాటి పురంధరేశ్వరికి జరిపిన మునిసిపల్ పౌర సన్మానంలో, ఎన్టీఆర్ ఆశీర్వాదం వల్లనే తాను రాజకీయాలలో తొలిసారిగా మునిసిపల్ ఛైర్మన్ కాగలిగానని ప్రకటించాడు వివేకానందరెడ్డి. దుర్మార్గమైన ప్రకటన ఇది. ఆయన మునిసిపల్ ఛైర్మన్ అయ్యింది 1995లో. అప్పటికి ఐదేళ్ల క్రితమే వారు తెలుగుదేశాన్ని వదలి కాంగ్రెస్‌లోకి వచ్చేశారు. నిజానికి 1987 ఎన్నికలలో మునిసిపల్ ఛైర్మన్ టిక్కెట్ కోసం విజయవాడ కెనాల్ గెస్ట్‌హౌస్‌లో ఎన్టీఆర్ కాళ్లను తన కన్నీళ్లతో తడిపి వేడుకొన్నాడు వివేకా. కానీ ఎన్టీరామారావు ఆనాడు కాళ్లు విదిలించుకొని వెళ్లిపోయాడు. తెలుగుదేశంలో వున్నన్ని రోజులూ వివేకాకు మునిసిపల్ ఛైర్మన్ సంగతి దేముడెరుగు, కనీసం కార్పొరేటర్ టిక్కెట్ కూడా రాకుండా చూశాడు తాళ్లపాక రమేష్‌రెడ్డి. వివేకాకు రాజకీయ భిక్ష పెట్టింది నేదురుమల్లి జనార్ధనరెడ్డి. 1995లో మునిసిపల్ ఛైర్మన్ టిక్కెట్, 1999లో ఎమ్మెల్యే టిక్కెట్ ఆయన దయతో ఇచ్చినవే. ఆ తర్వాత వారి రాజకీయ ప్రాభవం మొత్తం రాజశేఖర్‌రెడ్డి ధర్మం. ఈ నిజాలను కప్పిపెట్టి, ఎన్టీఆర్ కుమార్తె మెప్పు పొందడానికి ఎన్టీఆర్ ఆశీర్వాదం వల్లనే తాను రాజకీయాలలో రాణించానని చెప్పడమంటే, అవకాశవాదానికి ఎంతటి పరాకాష్టో అర్థం చేసుకోవచ్చు.

అదటుంచి వైఎస్ కుటుంబ విషయం చూస్తే, జగన్‌ను పూర్తిగా వదలి పెట్టేశారు సోదరులిద్దరూ. జగన్ వద్దకు వెళ్లడం కానీ, ఆయనకనుకూలంగా మాట్లాడడం కానీ మానివేశారు. జగన్‌ను కలిస్తే రోశయ్యకు కోపం వస్తుందడమే అందుకు కారణం. ఎందుకైనా మంచిదని కెవిపి రామచంద్రరావుతో మాత్రం సత్సంబంధాలు నెరపుతున్నారు.

వైఎస్ కుటుంబానికి ఆనం సోదరులు చేయదగిన అపకారం కాదిది. ఆయన పుణ్యంతో పదవులు, ఆయన ధర్మంతో కోట్లాది రూపాయల అక్రమార్జన చేసిన వారు ఆయన సావత్సరీకం కూడా గడవక ముందే వదలి పెట్టేశారంటే, వీరెంత గుండెలు తీసిన బంట్లో అన్న ఆశ్చర్యం కలుగుతున్నది. రామనారాయణరెడ్డి తన వద్దకు రాకపోవడం, తన అనుకూలురైన తతిమా మంత్రులతో కూడా అంటీముట్టనట్లు గడపడం జగన్ దృష్టికి వెళ్లింది. వీళ్లు ఇంత నమ్మకద్రోహం చేస్తారని కలలో కూడా అనుకోలేదని బాధ పడుతున్నాడు జగన్. రాజశేఖర్‌రెడ్డి ద్వారా ఆర్థికంగా కానీ, రాజకీయంగా కానీ ఏ మాత్రం లబ్ధిపొందని గోనె ప్రకాశరావు, అంబటి రాంబాబు వంటివారు జగన్ కోసం తమ ప్రాణాలనైనా ఇవ్వడానికి సిద్ధపడుతుంటే, వైఎస్ పేరు చెప్పుకొని కోట్లు కొల్లగొట్టిన ఆనం సోదరులు మాత్రం నడి మధ్యలో పుట్టి ముంచి ఒడ్డెక్కి వెళ్లిపోవడం ఎవరికైనా బాధ కల్గించే విషయమే కదా?


జమీన్‌రైతు
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

# చిన్నారుల "ఆట" నిషేధం... మంచి నిర్ణయం!

ఏ టివి ఛానల్ చూసినా రియాలిటీ షోల పేరుతో నిర్వహిస్తున్న కార్యక్రమాలే దర్శనమిస్తున్నాయి. రకరకాల పేర్లతో డ్యాన్సు పోటీలు, అందులోనూ ముక్కుపచ్చలారని చిన్నారులతో చేయిస్తున్న అసభ్యకర డ్యాన్సులు కన్పడుతుంటాయి. అతి అలంకరణతో, కురచ దుస్తులతో పిల్లలు చేస్తున్న నృత్యాలు కొందరికి చక్కని కాలక్షేపం కల్గిస్తున్నా, మరికొందరి హృదయాలను బాధపెడుతున్నాయి. దీనిపై పలు ఫిర్యాదులు, ఆరోపణలు రావడం, రాష్ట్ర మానవ హక్కుల కమిషన్ దృష్టికి ఈ సమస్య వెళ్లడంతో ఛైర్మన్ జస్టిస్ సుభాషణ్‌రెడ్డి దీనిపై తీవ్రంగా స్పందించారు. రియాల్టీషోలు క్రూయాలిటీషోలుగా మారుతున్నాయని, పిల్లల జీవితాలతో ఆటలాడే హక్కు ఎవరికి లేదంటూ అలాంటి షోలను నిలిపివేయాలని చారిత్రాత్మక తీర్పు నిచ్చారు. అంతేకాకుండా పలు అంశాలను ఆయన ప్రస్తావించారు. శృతిమించిన



హద్దు దాటిన ఆటపై వేటు వేసిన న్యాయమూర్తి సుభాషణ్ రెడ్డి. (ఇన్‌సెట్‌లో).

శృంగార పాత్రలలో పిల్లలను డ్యాన్సు చేయిస్తూ, వారిని అలనాటి శృంగార తారలు జ్యోతిలక్ష్మి, జయమాలిని, సిల్క్‌స్మితలతో పోలుస్తూ న్యాయనిర్ణేతలు చేస్తున్న వ్యాఖ్యలను తప్పుబట్టారు. ఇలాంటివి అభం శుభం తెలియని పసి మనస్సుల్లో విషాన్ని నింపుతాయని, పసిమనసులను కలుషితం చేస్తాయని వ్యాఖ్యానించారు. వయసుకు మించి మాటలు, చేష్టలతో పిల్లలను అసభ్యకర నృత్యాలకు ప్రోత్సహించడం అలాంటి షోలను నిర్వహించడం రాజ్యాంగం కల్పించిన హక్కులను కాలరాయడమేనని తీవ్రంగా వ్యాఖ్యానించిన ఛైర్మన్ అలాంటి షోలపై నిషేధం విధించారు. కళలకు, కళాకారులకు తాను వ్యతిరేకం కాదని కానీ అవి పిల్లలను ప్రోత్సహించేలా వుండాలేగాని, చెడుదారి పట్టించేలా వుండకూడదన్న కమిషన్ తీర్పుపై పలువురు హర్షం వ్యక్తం చేశారు.



### అందరిదీ తప్పే!

రియాల్టీషోల పేరుతో పసి పిల్లలను డ్యాన్సు చేయించడంపై హక్కుల కమిషన్ స్పందించిన తీరు అభినందనీయం. ఈ తప్పులో అటు షో నిర్వాహకులది, పిల్లల తల్లిదండ్రులది, ప్రేక్షకులది భాగస్వామ్యం వుంది. ప్రేక్షకులు చూస్తున్నారు కాబట్టి మేము అలాంటి కార్యక్రమాలు నిర్వహిస్తున్నామని నిర్వాహకులు, తమ పిల్లలు టివిల్లో కన్పడితే తద్వారా పేరు ప్రఖ్యాతులు వస్తాయన్న ఆశతో తల్లిదండ్రులు, కార్యక్రమాలు ప్రసారం చేస్తున్నారు కాబట్టి చూస్తున్నామని ప్రేక్షకులు అనుకోవడం వల్లనే ఇలాంటి చౌకబారు డ్యాన్సుపోటీలు జరుగుతున్నాయి. పిల్లల తల్లిదండ్రులకు నిజంగా తమ పిల్లలను తీర్చిదిద్దాలని వుంటే సాంప్రదాయ నృత్యాలు, జానపద కళల్లో శిక్షణను ఇప్పిస్తే పలువురు మెచ్చుకొంటారు. ఏది ఏమైనా హద్దులు దాటనంతవరకు ఏ కార్యక్రమైనా బాగుంటుంది.

**- కళాంజలి అనంత్,** నెల్లూరు.



### చెడుదారి పట్టే అవకాశం

చిన్న వయసు నుంచే పిల్లల్లో అశ్లీల నృత్యాలు చేయించడం వలన వారు చెడు దారి పట్టే అవకాశం ఎక్కువ. తెలిసీతెలియని వయసులో పిల్లలను తప్పుదారి పట్టించేలా ప్రోత్సహించడం కొందరు తల్లిదండ్రులు చేస్తున్న తప్పిదం. పేరు కోసం, టివిల్లో కన్పించాలన్న ఉద్దేశ్యంతో అలాంటి పాటలకు డ్యాన్సులు చేయిం చడం వలన తెలియకుండానే పిల్లల్లో విషబీజాలు నాటుతున్నాం. దీనిపై మానవ హక్కుల కమిషన్ స్పందించిన తీరు అభినందనీయం. ఇప్పటికైనా తల్లిదండ్రులు అలాంటి షోలకు పిల్లల చేత డ్యాన్సులు చేయించడంపై ఆలోచన చేయాలి.

**- జె.వి.భాస్కర్,** నెల్లూరు.



### పసి మనసులపై ప్రభావం

పిల్లలకు చిన్ననాటి నుంచే భారతీయ సంస్కృతి, సాంప్రదాయాల పట్ల అవగాహన కల్పించాలి. అంతే తప్ప రియాల్టీషోల పేరుతో తెలిసి తెలియని వయసులో అశ్లీల నృత్యాలు నేర్పించడం, ఆయా పోటీలకు పంపడం తప్పు. దీని ప్రభావం పసి మనసులపై చాలా వుంటుంది. దీనిని దృష్టిలో వుంచుకొని అలాంటి కార్యక్రమాలకు చిన్నారులను దూరంగా వుంచాలి. కూచిపూడి, భరతనాట్యం, సంగీతంలో శిక్షణ ఇప్పించినట్లయితే మంచి పౌరులుగా తీర్చిదిద్దబడతారు.

**- ఎస్.వి.సత్యం,** నెల్లూరు.

# చెప్పాపెట్టకుండానే గ్రామీణ విద్యుదీకరణకు మంగళం!

గ్రామీణ ప్రాంతాలలో నివసించే నిరుపేదల కోసం ప్రవేశపెట్టిన రాజీవ్‌గాంధీ గ్రామీణ విద్యుదీకరణ పథకానికి కేంద్ర ప్రభుత్వం బ్రేకు వేసింది. గ్రామీణ ప్రాంతాలలో గృహ విద్యుత్ సర్వీసు కోసం దరఖాస్తు చేసుకున్న ఎస్సీ, ఎస్టీ నిరుపేదలకు 125 రూపాయలకే విద్యుత్ సర్వీసు మంజూరు చేసేవారు. దరఖాస్తు చేసుకున్న ఏడు రోజులలోపు మీటర్ బోర్డుతోపాటు సర్వీసు వైరును ఉచితంగా ట్రాన్స్‌కో అధికారులు అందజేసేవారు. అయితే ఈ పథకం గ్రామీణ ప్రాంతాలలో నివసించే ప్రజలకిప్పటికీ తెలియదంటే ఆశ్చర్యపోక తప్పదు. అసలు ఈ పథకం వుందన్న సంగతి ట్రాన్స్‌కో అధికారులకు మాత్రమే తెలుసు.

2006 సంవత్సరం నుండి జిల్లావ్యాప్తంగా ఇందిరమ్మ గృహ నిర్మాణ పథకం అమలయ్యే ఎస్సీ, ఎస్టీ కాలనీలకు ఈ పథకం క్రిందనే విద్యుదీకరణ జరిగింది. ఇంకా అనేక కాలనీలలో ఈ పథకం అమలు జరగాల్సి వుంది. ఎస్సీ, ఎస్టీలకు మీటర్ బోర్డు, ఉచితంగా సర్వీసు వైరు అందజేసే పనులను కాంట్రాక్టర్లకు ట్రాన్స్‌కో అప్పగించడంతో అనేక అవకతవకలు చోటుచేసుకున్నాయి. ట్రాన్స్‌కోలో పనిచేసే కొందరు అధికారులు కాంట్రాక్టర్లతో లాలూచీపడి ఈ పథకాన్ని నిర్వీర్యం చేసిన సంఘటనలు లేకపోలేదు. ఈ పథకం వర్తించే వినియోగదారులకు మీటర్ బోర్డు, సర్వీసు వైరు అందించకపోయినా అందించినట్లు రికార్డులలో నమోదుచేసి నిధులు స్వాహా చేశారు.

ట్రాన్స్‌కో నుంచి అనుమతి పొందిన కాంట్రాక్టర్ ఇందిరమ్మ కాలనీలకు తప్ప మిగిలిన గ్రామాలలో పథకం అమలు చేయలేదు. ఈ విషయం ఆ శాఖ ఉన్నతాధికారులకు తెలిసినా కూడా చూసీచూడనట్లుగా వ్యవహరిస్తూ వచ్చారు. ఈ పథకం గురించి జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశంలో మంత్రులు, ఎమ్మెల్యేలు ప్రశ్నించిన సమయంలో మాత్రమే దీని గురించి అధికారులు వివరించడం జరిగింది. ఎస్సీ, ఎస్టీలకు లబ్ది చేకూరాలన్న లక్ష్యంతో ప్రవేశపెట్టిన ఈ పథకం ఆ శాఖ అధికారుల పాలిట కల్పతరువుగా మారిపోయింది. దీనివల్ల జిల్లావ్యాప్తంగా పలు ఎస్సీ, ఎస్టీ కాలనీలు విద్యుదీకరణకు ఇప్పటికీ నోచుకోలేకపోయాయి.

జిల్లాలో అన్ని కాలనీలకు విద్యుదీకరణ చేసినట్లు ట్రాన్స్‌కో అధికారులు ప్రకటించడంతో ప్రభుత్వం రాజీవ్‌గాంధీ గ్రామీణ విద్యుదీకరణ పథకాన్ని ఇటీవల రద్దు చేస్తూ ఉత్తర్వులు జారీ చేయడం జరిగింది. విద్యుత్ సర్వీసు కావలసిన వారు దరఖాస్తు చేసుకోవడానికి సంబంధిత విద్యుత్ కార్యాలయానికి వెళితే 425 రూపాయలు ఫీజు చెల్లించాలని సిబ్బంది చెప్పడంతో తిరిగి ఇంటిదారి పడుతున్నారు. ఈ పథకం రద్దు చేసిన విషయాన్ని కూడా ఆ శాఖ అధికారులు, సిబ్బంది గ్రామీణ ప్రాంత ప్రజలకు సమాచారం అందించకపోవడంతో ఇటువంటి పరిస్థితులు తలెత్తుతున్నాయి.


నిర్ణయాధికార కేంద్రం నెల్లూరులోని విద్యుత్‌భవన్.

ప్రభుత్వం వున్నపళంగా ఈ పథకాన్ని రద్దుచేయడంతో నిరుపేదలైన ఎస్సీ, ఎస్టీలపై అదనపు ఆర్థిక భారం పడుతుంది. ముందుగా దరఖాస్తు చేసుకున్న వారికి 125 రూపాయలకే విద్యుత్ సర్వీసు మంజూరు కాగా ప్రస్తుతం దరఖాస్తు చేసుకొన్న వారు అదనపు సర్వీసు చార్జీలు చెల్లించాలని అధికారులు చెబుతున్నారు. దీంతో ఈ పథకం రద్దయిన విషయం తెలుసుకున్న వారు అటు ప్రభుత్వాన్ని, ఇటు ట్రాన్స్‌కో అధికారులను శాపనార్థాలు పెడుతున్నారు. ట్రాన్స్‌కో అధికారుల వద్ద జిల్లాలో ఎన్ని కాలనీలకు ఇంకా విద్యుదీకరణ చేయాలన్న సమాచారం లేదు. ఈ పథకం అమలు కావాల్సిన కాలనీలు అనేకం వుండగా ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం కారణంగా మరికొన్ని సంవత్సరాలు చీకటిలోనే వుండిపోయే ప్రమాదం ఏర్పడింది. జిల్లాకు చెందిన మంత్రిగాని, ఇతర ఎమ్మెల్యేలు గాని ఈ పథకం రద్దు కాకుండా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురాలేకపోయారు. భవిష్యత్తులో ఈ పథకం తిరిగి పునః ప్రారంభం అయ్యే అవకాశం లేదని ట్రాన్స్‌కో అధికారులు చెప్పడం విశేషం.

# పల్లెటూర్లో ప్రపంచస్థాయి పాఠశాల!

## నెల్లూరుజిల్లా ప్రజలకు వెంకయ్యనాయుడిచ్చిన విలువైన కానుక

బిజెపి నేత ఎం.వెంకయ్యానాయుడు, అపరిచితుడు సినిమాలో వలె రెండుపార్శ్వాలు సంతరించుకొంటున్నాడు. ఢిల్లీలో వున్నంత సేపూ ఆయన ఆలోచనలు, మాటలు దేశానికి సంబంధించిన గంభీర అంశాలపై కేంద్రీకృతమౌతాయి. నెల్లూరులో అడుగు పెట్టిన పక్క క్షణం నుంచి ఆయన పరిధి వెంకటాచలం పల్లెటూళ్ల పరిసరాలకు మాత్రమే పరిమితమౌతున్నది. ఇక్కడుంటే దేశం గురించి మాట్లాడడు. అక్కడికి వెళ్తే వెంకటాచలం సంగతి ఎత్తడు. ఆయన జీవితంలో ఒక ప్రధాన భాగాన్ని ఆక్రమిస్తున్నది వెంకటాచలంలోని స్వర్ణభారత్ ట్రస్ట్. నిజానికి ఆయన నిర్వహించిన పదవులు, విశ్వవ్యాప్తంగా పెంచుకొన్న రాజకీయ పలుకుబడితో పోలిస్తే స్వర్ణభారత్ ట్రస్ట్ పిపీలకం వంటిది మాత్రమే. కానీ ఆయన దానికి చాలా విలువ ఇస్తున్నాడు. అన్నిటినీ వదలి ఆ పనులలోనే మునిగి తేలుతున్నాడు.

స్వర్ణభారత్ ట్రస్ట్‌లో ఇప్పటి వరకు చేసిన కార్యక్రమాలన్నిటికీ తలమానికంగా, అక్కడొక బడి కట్టించారాయన. బిర్లాలు, గోయెంకాలు నడిపే కార్పొరేట్ స్కూళ్లకు ఏ మాత్రం తీసిపోని రీతిలో నిర్మించిన ఈ బడి భవన సముదాయం చూస్తే, నెల్లూరుకు అంత ఆడంబరం అవసరమా అన్పిస్తుంది. కానీ నెల్లూరుజిల్లా విద్యార్థులకు ప్రపంచ స్థాయి విద్యను అందించాలనే సదాశయంతో, డబ్బుకు వెనకా ముందు చూడకుండా ఈ భూరి భవంతులు కట్టించారాయన.

కేంద్ర విద్యామంత్రిణి దగ్గుపాటి పురంధరేశ్వరి మొన్న 15తేది ఉదయం ఈ బడికి రిబ్బను కత్తిరించారు. సంస్కృతం తెలుగు కలగలిపి ఆమె చేసిన ప్రసంగం సభికులు నోరెళ్లబెట్టేట్లు చేసింది. ఆమెలో అంత పాండిత్యం దాగి వుందా అన్పించింది. దేశంలో ఆర్థిక అసమానతలు పెరిగి పోవడానికి అన్ని తరగతుల ప్రజలకు న్యాయమైన విద్య అందుబాటులో లేకపోవడమే కారణమని, దాన్ని రూపుమాపడానికి సేవాభావంతో నెలకొల్పే ఇటువంటి పాఠశాలలు ఉపకరిస్తాయని అన్నారు పురంధరేశ్వరి.

కార్పొరేట్ బడులలో చదివే విద్యార్థులు వున్నతవిద్యను ఆర్జిస్తున్నప్పటికీ, దానిలో మానవత్వ విలువలు లోపిస్తున్నాయని, మన సంస్కృతీ సాంప్రదాయాలతో ఈ తరహా విద్యార్థులకు సంపర్కం లేకుండా పోతున్నదని, ఆ కొరత తీర్చడానికే ఈ విద్యాసంస్థను తలపెట్టానని చెప్పారు వెంకయ్యానాయుడు.

25 ఎకరాల సువిశాల ప్రాంగణంలో నిర్మితమైన ఈ పాఠశాలలో ఎల్‌కెజి నుంచి ఇంటర్మీడియేట్ వరకు తరగతులుంటాయి. ఈ ఏడాది ఐదవ తరగతి వరకు మొదలు పెడుతున్నారు. ప్రతి ఏటా కొత్త తరగతులు పెంచుకొంటూ పోతారు. బోధన ఆంగ్లంలో, భావన భారతీయతతో అన్నది ఈ బడి నినాదం. ఇంగ్లీషు మీడియంలో క్లాసులు నడుపుతూ పిల్లలు భారతీయ సాంప్రదాయాల ప్రకారం దినచర్య నిర్వహించుకొనేట్లు చేస్తారట. ఐ డిస్కవరీ అనే కన్సల్‌టెన్సీ సంస్థ సహకారంతో బోధనా పద్ధతులలో ఆచరణాత్మక పద్ధతులను ప్రవేశ పెడుతున్నారు. విద్యార్థుల పరిజ్ఞానం పాఠ్య పుస్తకాలకు పరిమితం కాకుండా, నిజ జీవిత అనుభవాలతో మిళితమయ్యేదిగా వుండాలన్నది ఈ బోధనా పద్ధతుల లక్ష్యం. ఒక్కొక్క తరగతికి 25 మంది విద్యార్థులు మించకుండా చూస్తారట. ప్రతి 15 మంది విద్యార్థులకు ఒక టీచర్ నిష్పత్తిలో బోధనా సిబ్బంది వుంటారు. లక్షలలో ఫీజులు తీసుకొనే కార్పొరేట్ విద్యాసంస్థలు కూడా ఈ నిష్పత్తిని పాటించడం లేదు. లాభం దృష్టితో కాకుండా, సేవాభావనతో నడపడం వల్లనే ఇది వీలౌతున్నది. విద్యార్థికి సంవత్సరానికి 26500 రూపాయల ఫీజు నిర్ణయించారు. అది తప్ప డొనేషన్లు గట్రా వుండవు. ఆ పాఠశాలకున్న వసతులు, నిర్వహణ తీరుతో పోలిస్తే, దాదాపు ఉచితంగా చదువు చెప్పినట్లే లెక్క ఈ ఫీజుతో. సిబిఎస్ఇ సిలబస్‌తో సాగుతుంది చదువు. అయితే తతిమా పాఠశాలల వలె రోజూ, వారం వారం పరీక్షల ఒత్తిడి వుండదు. హోం వర్క్ వుండదు. పిల్లలకు చదువుతో పాటు మానసిక వికాసం సంతరించి పెట్టడం కోసం ఈ ఉపశమనం కల్గిస్తున్నారు. వారికి పుస్తకాల మోత కూడా వుండదు. బడిలోనే పుస్తకాలు వదలి వెళ్లిపోయే వీలుంది.

ఈ పద్ధతులలో బడి నడిపితే ఏటా కొన్ని కోట్ల రూపాయల నష్టం ఖాయం. లాభ నష్టాలు లేని దశకు చేరుకోవాలన్నా ఐదారేళ్లు పడుతుంది. అయినాసరే, ఖర్చుకు వెరవకుండా అదే పద్ధతిలో బడి నడవాలని నిర్దేశించాడు వెంకయ్యానాయుడు. నెల్లూరు నగరం నుంచి కంటే వెంకటాచలం చుట్టుపక్కల పల్లెటూళ్ల నుంచి వచ్చే పిల్లలకు ప్రాధాన్యత ఇవ్వాలన్నది సంకల్పం.


అక్షర విద్యాలయను ప్రారంభిస్తున్న కేంద్రమంత్రిణి పురంధరేశ్వరి.



అక్షర విద్యాలయ ప్రారంభోత్సవ సభలో మాట్లాడుతున్న వెంకయ్యనాయుడు.

ఇటువంటి పాఠశాల నెలకొనడం నెల్లూరుజిల్లా ప్రజలకు ఒక కానుక క్రిందే లెక్క. ఈ బడిస్థాపనలో నాయుడు గారు చూపించిన సంకల్పం, దాని నిర్వహణలోని చిత్తశుద్ధి ద్వారా నెరవేరుతుందని ఆశిద్దాం.

# గాలివాటం రాజకీయం ఇదే ఆనం కుటుంబ నైజం!

చొక్కాలు మార్చినంత సులభంగా పార్టీలు, వున్న పార్టీలో వర్గాలు మార్చడం ఆనం కుటుంబానికి వెన్నతో పెట్టిన విద్య. జనతా పార్టీ నుంచి కాంగ్రెస్‌కు, కాంగ్రెస్ నుంచి తెలుగు దేశానికి, తెలుగుదేశం నుంచి మళ్లీ కాంగ్రెస్‌కు అత్యంత సులభంగా మారిపోయిన చరిత్ర వారిది. ఏ పార్టీతోనూ వారికి బంధం వుండదు. ఏ నాయకుడితోనూ వారికి బంధుత్వం వుండదు. ఏ గాలి తోలితే ఆ చాప ఎత్తడం అలవాటు. ఇప్పుడు వైఎస్.రాజశేఖర్‌రెడ్డి కుటుంబ విషయంలో కూడా ఈ రాజకీయ సూత్రాన్నే పాటిస్తున్నారు ఆనం సోదరులు.

వైఎస్.రాజశేఖర్‌రెడ్డి తన ముఖ్యమంత్రి పదవీ కాలంలో ఆనం రామనారాయణరెడ్డికి ఎనలేని ప్రాధాన్యత ఇచ్చారు. నెల్లూరు జిల్లా వ్యవహారాలలో ఆయన మాటే చెల్లుబాటయ్యేట్లు చూశాడు. మంత్రి పదవి నుంచి మునిసిపల్ ఎన్నికలలో టిక్కెట్లు, మేయర్‌గా భానుశ్రీ ఎన్నిక వంటి విషయాలన్నింటిలో రామనారాయణరెడ్డి ఏది కోరితే అది చేశాడు. దానివల్ల నెల్లూరుజిల్లా రాజకీయాలలో తతిమా వారందరూ తనకు వ్యతిరేకులుగా మారిపోయే ప్రమాదం ఏర్పడినా లెక్కచేయలేదు వైఎస్. ఆయన చూపిన ఆదరణ ఫలితంగా సోదరులిద్దరూ అటు రాజకీయంగా, ఇటు ఆర్థికంగా ఎంతో లాభపడ్డారు. 2004 ఎన్నికల నాటికి వారి దగ్గర స్వంత సైకిల్ కూడా లేదు. స్నేహితులు జాలి పడి ఫైనాన్స్‌లో తీసిచ్చిన కార్లలో తిరగడానికి కూడా డీజిల్‌కు డబ్బుండేది కాదు. పెట్రోల్ బంకుల వారిని ప్రాధేయపడి అప్పుకు డీజిల్ పట్టించుకొనేవారు. హైదరాబాద్‌లో వారు ఆటోలలో తిరగడం చూడలేక, ప్రస్తుత జిప ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తన కారు అరువు ఇచ్చేవారు.

### జగన్‌ను వదలి పెట్టేశారు!

రాజశేఖర్‌రెడ్డి పుణ్యాన వారి ఆర్థికస్థితి అనూహ్యంగా మారిపోయింది. ఈ ఆరేడేళ్లలో ఎన్ని కోట్లు కొల్లగొట్టారో మనకు లెక్క తెలియదు కానీ, వారి ఇంట్లో ఇప్పుడున్న కార్ల విలువ మాత్రమే చూసినా పదికోట్లకు పైబడుతుంది. బిఎండబ్ల్యూ, వోక్స్ వ్యాగన్‌ల నుంచి వారి దగ్గర లేని కారు లేదు. రాజకీయంగా కూడా వారు బాగా ఎదిగారు. నేదురుమల్లి జనార్దనరెడ్డి దగ్గర చేతులు కట్టుకొని కూర్చుని, ఆయన కాలితో చెప్పే పనులను చేతితో చేసుకొని వస్తుండిన వారు, అదే జనార్దనరెడ్డిని రాజకీయంగా సవాలు చేసే స్థాయికి ఎదిగారు.

తమ జాతకాలను ఇంతగా మార్చిన వైఎస్ పట్ల వారు ఆజన్మాంతం రుణపడి వుంటారని, కృతజ్ఞులై వుంటారని భావించడం సహజం. అది కనీస మానవతా ధర్మం. కానీ రాజకీయాలలో కృతజ్ఞతకు, మానవత్వానికి స్థానం వుండదని మరొకసారి రుజువు చేశారు ఆనం సోదరులు. రాజశేఖర్‌రెడ్డి మరణించిన తొలిదినాలలో వీరు ఆయన పట్ల తమ భక్తి ప్రపత్తులు చాటుకొన్నారు. రోశయ్యను ముఖ్యమంత్రిగా గుర్తించనట్లే వ్యవహరించారు. జగన్‌ను అధికార పీఠం మీద కూర్చోబెట్టాలని అల్లరి సృష్టించారు. రోశయ్యను మర్యాద పూర్వకంగా కూడా కలిసేవారు కారు. మొదట మొదట జరిగిన క్యాబినెట్ సమావేశాలలో ముఖ్యమంత్రి మీద రుసరుసలాడాడు రామనారాయణరెడ్డి.

ఇప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది. రోశయ్య కరుణా కటాక్ష వీక్షణాల కోసం తపస్సు చేస్తున్నారిప్పుడు. ఆయన నెల్లూరుకు వస్తే నగర

కొరవ 14వ పేజీలో

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.